తోయజదళనేత్ర ద్రుపదరాజాత్మజ
కమనీయగజరాజగమనలీలఁ
జనుదెంచి సురరాజసన్నిభు నభినవ
యౌవనోద్భాసితు నసితరత్న
రుచిరాంగు నంగజరూపు ధనంజయుఁ
దన చేతి సితపుష్పదామకమునఁ

గీ. బొలఁతిముదముతోడఁ బూజించె నట్టి యు
త్సవముఁ జూచి దానిసైఁప కపుడు
కౌరవేంద్రుఁ డాదిగాఁగలభూపతు
లెల్ల నలిగి కలయ నేపు రేఁగి. 102

మ. ఏలరాఁబనిచెన్ మహీశులనెల్లఁ జుట్టమపోలె ము
న్నేల సత్కృతిజేసె నిందఱకిమ్మహారథు లుండఁగా
నేల కన్యక నిచ్చె విప్రునకిప్పుడెందు. శఠుండు పాం
చాలుఁ డీతఁడు వీని నిర్గతసత్త్వుఁ జేయుద మాజిలోన్. 103

క. తనవిద్యపేర్మి నృపనం
దనఁ బడసెను విప్రుఁ డితనితప్పే కడు దు
ర్జనుఁ డీ ద్రుపదుఁడు నృపతుల
ననయముఁ గడు మెచ్చఁడయ్యె నతిగర్వితుఁడై. 104

వ. ఏమిదోషంబుసేసియు బ్రాహ్మణుండు వధ్యుండుగాఁడు మన రాజ్యంబును నర్థంబును బ్రాహ్మణార్థంబ కావున నవ్విప్రు తోడిదే మని ద్రుపదుపయి నేగుదెంచిన ద్రుపదుండును భీతుండై బ్రాహ్మణుల మఱువు సొచ్చె నిట్లు శరణాగతుం డయిన ద్రుపదు నోడకుండు మని బ్రాహ్మణులు దమతమ

దండాజినంబు లెత్తి ప్రతిబలంబులపయి వీచుచున్న వార
లం జూచి నగుచు నర్జునుం డి ట్లనియె. 105

—అర్జునుండు గర్ణునితో యుద్ధంబు సేసి జయించుట.—

క. కడఁగి మదీయాస్త్రము లని
యెడుపటుమంత్రముల నిప్పుడీరిపునృపులన్
కడిఁది విషాహుల దర్పం
బుడిగించెదఁ దొలఁగి చూచుచుండుఁడు మీరల్. 106

వ. అని తానును భీమసేనుండును గ్రమ్మఱి రిపుబలంబు పయి
నమితశరంబు లేసె భీముం డొక్క వృక్షంబు వెఱికి కొని
దండహస్తుం డయిన దండధరుండునుంబోలె నర్జునునకు సహా
యుం డయి నిలిచె నంత నయ్యిరువుర మహాసంరంభంబుఁ
జూచి విస్మితుం డై కృష్ణుండు బలదేవున కి ట్లనియె. 107

సీ. తాలాభ మగువిల్లుఁ దాల్చి విరోధుల
నెగచుచు నున్న వాఁ డింద్ర తనయుఁ
డాతని కెలన మహావృక్షహస్తుఁ డై
యున్న వీరుండు వృకోదరుండు
యంత్రంబు నరు డేసి నప్పుడు పోయిన
యాగార వర్ణుండు యమతనూజుఁ
డాతనితోడన యరిగిన యిరువురుఁ
గవల వారర్కప్రకాశ తేజు

గీ. లనిన లక్కయింటనగ్ని దాహంబున
నెట్లు బ్రదికి రొక్కొయిమ్మహాత్ము

లెట్టి పుణ్యాదినమొకయేవ్వరుఁ జూచితి
మనుచు సంతసిల్లెకహాలధరుండు. 108

క. కురుపతి సూడఁగఁ గర్ణుఁడు
నరుఁ దాఁకెను శల్యుఁ డనిలకనందనుఁ దాఁకెన్
సరభసమున విస్మయమం
దిరి ధరణీదేవ మనుజకదివిజప్రవరుల్. 109

శా. కర్ణుండున్ విజయుండునొండొరులఁజుల్కం దాఁకిచాపంబులా
కర్ణాంతంబగుచుండఁ గాఁదిగిచి యుకగ్రక్రోధులై యేసిరా
పూర్ణంబయ్యెఁ దదీయబాణ తతినంకభోభృత్పథం బెల్ల నా
స్తీర్ణంబయ్యెధరిత్రియెల్లనవి సెన్ కదిక్చక్రమెల్లన్ వడిన్. 110

క. వీరుండర్జునుఁ డేయున
పారశరావలుల నడుమకవారింపంగా
నేరక యే టుడిగిమహా
శూరుఁడు రాధేయుఁ డిందుకజున కిట్లనియెన్. 111

క. నాయెదురఁ జక్కనై యని
సేయన్ భార్గవునకున్ విక శేషజ్ఞుఁడు కాం
తేయుఁ డగు విజయునకుఁ గా
కాయతభుజశక్తి నొరులకకలవియె ధరణిన్. 112

క. నీ వప్రాకృతబలుఁడవు
నీవిక్రమమునకు విల్లుకనేర్పునకు మహీ
దేవకులోత్తమ మెచ్చితి
నావుడుఁ బార్థుండు గర్ణుకనకు నిట్లనియెన్. 113

మధ్యాక్కర. ఏను నీచెప్పిన వారిలోపల నెవ్వఁడఁగాను
గానీన సర్వ శస్త్రాస్త్ర విద్యలఁ బ్రగడుఁ బ్రసిద్ధుండ
భూనుత బ్రహ్మతేజోధికుండ నిన్నుఁ బోరిలో నోర్వఁ
గానున్న వీరుండ నొండు దక్కులోఁ బగక చక్కనిలుము. 114

వ. అనిన విని కర్ణుండు బ్రాహ్మణతేజంబ జేయంబని విజయుతోడ యుద్ధంబు సేయ నొల్లక క్రమ్మఱియె. అట్లు సకల రాజలోకం బెల్లఁ బార్థుచేత భంగపడి చన నిట శల్య భీమసేనులు పెనంగి మల్లయుద్ధంబు సేయునెడ భీముండు భీమబలంబునం బట్టికొని శల్యుం ద్రెళ్ళవైచిన. 115

గీ. సెల్లుఁ డట్లు నేలఁ ద్రెళ్ళి చెచ్చెర లేచి
యొడలు దుడిచి కొనుచు నొయ్యఁ జనియె
వానిఁ జూచి నగుచు మానుగా విప్రులు
భూరిసత్త్వ భీముఁ బొగడి రపుడు. 116

గీ. పరశు రాముఁడొండె హరుఁడొండె నరుఁడొండె
గాక యొరులు గలరె కర్ణుఁ గెలువ
బలిమి భీముఁడొండె బలదేవుఁ డొండెగా
కొరులు నరులు శల్యు నోర్వఁ గలరె. 117

వ. వీరెవ్వరో యెందుండి వచ్చిరో యెఱుంగవలయునని దుర్యోధనాదులయిన రాజపుత్త్రులెల్ల విస్మితులయియున్న వారలం జూచి కృష్ణుం డిట్లనియె. 118

చ. పరులకు దుష్కరంబయిన భాసురకార్యము సేసియీస్వయం
వరమునఁ బత్నిగాఁ బడసె వారిరుహాయతనేత్రఁ గృష్ణ నీ

ధరణీసురాన్వయోత్తముఁడు ధర్మవిధింజెప్పెడయ్యె యింక నె
వ్వరికిని జన్నె వీని ననవద్యపరాక్రమ మాక్రమింపఁగన్.

వ. వలవదుడుగుండ నివారించిననట్లు కృష్ణునిచే నివారితులై
రాజపుత్రులు దమతమ దేశంబులకుంజని రంత భీమార్జు
నులు బ్రాహ్మణ పరివృతులై ద్రుపదరాజపుత్రిం దోడ్కొని
చనిరంతకు ముందర. 120

సీ. ఉత్సవ సందర్శ నోత్సుకులై పోయి
కడుఁబెద్ద ప్రొద్దయ్యెఁ గొడుకు లేల
మసలిరో కౌరవుల్ విసువకవైరంబు
భావించి పాపస్వభావు లెఱిగి
క్రందునఁజంపి రోయందుల కేవ్వరు
లీలతో నొక్కట నేల యరిగి
రవ్యయుండయిన వేదవ్యాసు వచనంబు
నిక్కంబు గాకుండు నొక్కొ వేల్పు

గీ. లారభూసురేశు లారమీశరణంబ
కాని యొండు గతియుఁ గాన నాకు
శరణమగుఁడు సుతుల గరుణతో రక్షింపుఁ
డనుచుఁ గుంతి వగచి వనరుచుండె. 121

—అర్జునుండు ద్రౌపదిందెచ్చి తల్లికి నివేదించుట.—

వ. అట్టియవసరంబునఁ దల్లి కెదుర్కొని ధర్మరాజును గవలవా
రును మున్న వచ్చియున్న ననంతరంబ భీమార్జునులు ద్రౌప
దీసహితులయి వచ్చి మే మొక్క భిక్షఁదెచ్చితిమని తల్లికి

నివేదించిన నెఱుంగక యెప్పటియట్ల కావగచి కుంతీదేవి సంతసిల్లి దాని మీ రేవురు నుపయోగింపుం డని కొడుకుల నియమించి భువనత్రయ రాజ్యలక్ష్మియుంబోలె నున్న యక్కన్యకంజూచి లజ్జించి యధర్మభీత యయి ధర్మతన యున కిట్లనియె. 122

సీ. ఈతన్వి దోడ్కొని నీ తమ్ములిరువురు
ప్రీతి నేతెంచి యీ భిక్ష యొప్పఁ
గొనుమని నాకుఁ జెప్పినను నేవురు నుప
యోగింపుఁడంటి నాయుక్తి దొల్లి
యనృత మెన్నండు గా దనఘ మీ రెప్పుడు
మద్వచనాతిక్రమంబు సేయ
రిది లోకమున లేనియది యేమి సేయంగ
నగు నని చింతాకులాత్మ యైనఁ

గీ. దల్లి నూరార్చి వాసవతనయుఁ జూచి
పార్థ నీచేత బడయంగఁబడిన దీని
నగ్ని సన్నిధిఁ బాణిగ్రహంబు నీవ
చేయు మన ధర్మజునకును జిష్ణుఁ డనియె. 123

వ. పెద్దవాఁడుండఁ గొండిక వాఁడు వివాహంబగుట ధర్మవిరుద్ధం బు గావున దీని నీ వగ్రమహిషిఁగాఁ బరిగ్రహింపుము మా నలువురయనుమతంబిట్టిదయనుచున్న యవసరంబున విధిప్రే రణంబునం జేసి. 124

ఉ. ఆలలితాంగియందుహృదయంబులుదృష్టులు నిల్పి పాండుభూ
పాలతనూజ పంచకము పంచశరాహతి బొందె నొక్కతన్

బాలిక దొల్లి యేవురకు భామినిగా సృజియించి యున్న యా
వ్యాలరి బ్రహ్మచెప్పు పరమార్థముగా కదియేల యొం
[డగున్. 125

వ. ఇట్లు పాంచాలియందు బద్ధానురాగులై యున్న తమ యే
వుర యభిప్రాయంబెఱింగి వేదవ్యాసవచనంబులు దలంచి
ధర్మతనయుండు దమ్ముల కిట్లనియె. 126

క. గురువచన స్థితి మనకే
గురకును నిది పత్నిగాఁ దగుంగావున నీ
తరుణినిఁ బరిగ్రహింతము
తిరముగ గురువచనమొందు దెఱఁగేల యగున్. 127

వ. అని పలుకు నవసరంబున. 128

శా. రాజత్కీర్తులువచ్చి కాంచి రనఘుల్ రాముండు కృష్ణుం
[డున
య్యాజామీఢు నజాతశత్రు నృపలోకారాధ్యు నుద్యద్గుణ
భ్రాజిష్ణుం దమ మేనయత్తకొడుకున్ బాలార్కతుల్యోజ్జ్వల
త్తేజున్ భ్రాతృచతుష్క మధ్యగతుఁ గౌంతేయాగ్రజున్
[ధర్మజున్. 129

వ. కని తమ్మెఱింగించి యతిస్నేహంబున యధిష్ఠిరునకుం గుం
తికి మ్రొక్కి భీమార్జున నకుల సహదేవులం గౌఁగిలించు
కొని పరమసమ్మదరస పూరితులై యున్న వారికుశలం బడిగి
ధర్మజుం డిట్లనియె. 130

క. ఒవ్వమిఁ గౌరవులకుఁ గడు
దవ్వయి విప్రవేషధారులమయి మ

మ్మెవ్వరు నెఱుంగకుండఁగ
నివ్విధమున నున్న నెట్లు లెఱిఁగితి రీరల్. 131

వ. అనిన నగుచు వాసుదేవుం డిట్లనియె. 132

ఉ. అంబుజమిత్రుఁ డంబుదచయాంతరితుం డగుడుం దదీయ తే
జంబు జగజ్జనంబులకు శక్యమె కప్పఁగ మీరు గూఢ భా
వంబున నున్న మీదగు నవారిత తేజము భూజనప్రసి
ద్ధంబగుఁగాక దానిఁ బిహితంబుగ నెవ్వరు జేయనేర్తురే. 133

వ. సకలరాజ సమక్షంబున నట్టి యతి మానుషంబయినయ
ద్భుతకర్మం బర్జునునకుఁ గా కన్యులకుఁ జేయనగునే యని
యెఱింగితిమి. మీ పరాక్రమంబు మిమ్ము నెఱింగించె. ధర్మ
రహితు లగు ధృతరాష్ట్ర దుర్యోధనులు సేసిన లాక్షాగృహ
దాహంబు వలన విముక్తుల రయితి రింక మీకుల్లగు నని
చెప్పి బలదేవసహితుం డయి వాసుదేవుం డరిగె నిట ద్రుప
దుండు దన కూఁతునకు వరుం డైనవాఁ డెవ్వఁడో యేవం
శంబునవాఁడో వాని చరితం బెట్టిదో యెఱింగి రమ్మని
ధృష్టద్యుమ్నుం బనిచిన నతండు భీమసేనార్జున ద్రుపదుల
పిఱుందన వచ్చి తన్నెఱుంగకుండ నక్కుంభకార గృహం
బున నుండి యంతయు నెఱింగిపోయి ద్రుపదున కిట్లనియె.

సీ. అయ్యిద్దఱును గృష్ణ నట్లొప్పఁ దోడ్కొని
చని యొక్క ముదుసలి సానికపుడు
మ్రొక్కి యక్కన్యను మ్రొక్కించి మఱి యొక్క
గౌరవర్ణుఁడు వంపఁ గడఁకతోడ

నలువురు భూసురనాథ గృహంబుల
కరిగి భైక్షము దెచ్చి యంతకూడు
నొగిన యయ్యవ్వకు నొప్పించి యున్నన
య్యవ్వయు ద్రౌపది నంతఁ బిలిచి

ఆ. బలి విధానమాలకు బ్రాహ్మణాతిథులకు
నన్నకాంక్షులైన యతిథులకును
నగ్రమందు నునిచి యయ్యన్న శేషంబుఁ
జెలువ రెండుపాళ్లు సేయుమొనర. 135

క. పెడఁదయురంబును నన్నువ
కడుపును దృఢకఠినతనువుఁగల యాతనికిం
దొడర నొకపాలు పెట్టుము
వడి నాగాయుతబలంబువాఁ డతఁ డబలా. 136

వ. మఱియు రెండవపాలన్నలువురకుం బెట్టి తద్భుక్తశేషంబు
నీవును నేను నుపయోగింతమని పంచినఁ గృష్ణయు నయ్యా
వ్వ పఱచిన రూపున నందఱకుం గుడువంబెట్టి తానును గుడి
చి దర్భలు విదిర్చి యందఱకు వేఱు వేఱశయనమ్ము లిమ్ము
గా రచియించి వానిపయి వారల కృష్ణాజినంబులు పఱచిన
నందఱు సుఖశయనులై యున్నవారి పాదంబులకు నుపధా
నభూతయై శయనించి 137

ఆ. కఱకు దర్భ పూరిపఱపులు భిక్షాన్న
మశన మట్టివారి నతిముదమున
నాదరించెఁ బ్రీతి నాదిగర్భేశ్వరి
యయ్యు సేవగింప దయ్యెఁ గృష్ణ. 138

క. కడవసములుఁ గోలలుఁ గ
ప్పడములు వీరల ధనంబు పరికింపఁగ నె
క్కడి దేశికు లని వగవక
మడవక తను మధ్య నిండుమనమున నుండెన్. 139

సీ. అంత నయ్యేవురు నయ్యాయి కథలొప్పఁ
జెప్పుచు మఱి రథ సింధురాశ్వ
విషయంబులును సమ విషమ మహోవ్యూహ
నిర్భేదనోపాయ నిపుణ విధులు
నాయుధ విద్యా రహస్య ప్రయుక్తులుఁ
బలికిరి పలికిన బాసఁజూడ
సత్యోత్తమ క్షత్త్రియాన్వయులగుదురు
చరితఁ జూడగ విప్రజాతు లగుదు

ఆ. రెఱుగరాదు వారి నీ రెండు జాతుల
వారుగాని కారు వైశ్యశూద్ర
హీనజాతు లనిన నెంతయు సంతస
మందెఁ బృషతపుత్త్రుఁ డాత్మలోన. 140

వ. వెండియు వారల నిమ్మ్మగా నెఱుంగవేఁడి తన పురోహితుం
బంచినం బురోహితుండును బ్రాహ్మణ సమూహంబుతోడ
వచ్చి పాండవులం గని ధర్మజు నియోగంబున భీముచేతఁ
బూజితుండయి యిట్లనియె. 141

ఉ. మీకులగోత్రనామములు మిమ్మును నెమ్మి నెఱుంగవేఁడిచిం
తాకులు డైనవాఁడు ద్రుపదాధిపుఁ డాతనికిం బ్రియంబుగా

వ. మరియుం దనయొద్దకువచ్చి యశంకితులయి క్షత్త్రియోచిత
మహాసనంబుల నున్నవారల రాజపుత్త్రులంగా నెఱింగిసంశ
యాపనోదనపరుండై ధర్మతనయునకు ద్రుపదుం డిట్లనియె
నయ్యా మీరుక్షత్త్రియులరో బ్రాహ్మణులరో మాయావు
లయి క్రుమ్మరుచున్న మంత్ర సిద్ధులరో కాక కన్యాపరిగ్ర
హణార్థంబు దివంబుననుండి వచ్చిన దివ్యులరో యెఱుంగము
మాకుసందేహంబయి యున్నయది.మీకులరూపెఱింగి కాని
యిక్కన్యక వివాహంబు సేయనేర మనిన ద్రుపదునకు ధర్మ
తనయుం డిట్లనియె. 149

క. క్షత్త్రియులము పాండు ప్రియ
పుత్రుల మే నగ్రజుండ భూనుతులు మరు
త్పుత్రార్జునయము లమలచ
రిత్రులు నలువురును వీ రరిందము లెందుఁ. 150

వ. వీరు కుంతీమహాదేవులని తన్నునుం దమ్ములనుం దల్లిని
నెఱింగించిన ద్రుపదుం డతిహర్ష రసావేశ పరవశుండయి
పెద్దయుంబ్రొద్దునకుఁ దెలిసి యానందజలభరితనయనుండ
గుచు నాపుణ్యంబున లాక్షాగృహంబు వలన విముక్తులర
యితిరని సంతసిల్లి తద్వృత్తాంతంబంతయు ధర్మతనయు
వలన విని ధృతరాష్ట్ర దుర్యోధనుల నిందించి సామప్రియ
భాషణంబుల నభీష్ట ప్రియసత్కారంబులను వారిం బూ
జించి యొక్కనాఁడు పుత్త్రమిత్ర బ్రాహ్మణ నివహపరి
వృతుండయి ద్రుపదుండు సుఖాసీనులయియున్న పాండవుల
కిట్లనియె. 151

క. సుత్రామపుత్త్రుఁ డభిజన
పాత్రుండు విచిత్రవీర్యుపౌత్త్రుఁడు శుభచా
రిత్రుం డీవిజయుఁడు మ
త్పుత్త్రికి వరుఁ డయ్యె నెట్టి పుణ్యోదయమో. 152

వ. స్వయంవరలబ్ధ యయిన యిక్కన్యక నర్జునుండు ధర్మవిధిం బాణిగ్రహణంబు సేయు ననిన ద్రుపదునకు ధర్మజుం డిట్లనియె నది యెల్లేను వివాహంబైనఁ బదంపడి భీమసేనుండు వివాహంబయిన మఱి యర్జునుండు వివాహంబగుఁగాక ముందర నర్జునునకుఁ బాణిగ్రహణంబు సేయనెట్లగు ననిన ద్రుపదుండు ధర్మతనయున కిట్లనియె. 153

తే. అట్లు లగునేని నిక్కన్య నభిమతముగ
వసుమతీనాథ నీవ వివాహ మగుము
ధర్మమార్గ మెవ్వరికిని దప్పనగునె
యనిన నాతని కనియె ధర్మాత్మజుండు. 154

వ. ఏన కా నిక్కన్యనే మేవురము వివాహంబయ్యెద మస్మన్మాతృనియోగం బిట్టిదయది మాకు నలంఘనీయం బనిన విని విస్మితుండై ద్రుపదుం డిట్లనియె. 155

క. ఒక్కపురుషునకు భార్యలు
పెక్కండ్రగు టెందు గలదు పెక్కండ్రకు నా
లొక్కత యగు టేయుగముల
నెక్కథలను వినియు నెఱుఁగ మెవ్వరి వలనన్. 156

వ. నీవు లౌకిక వైదిక ధర్మస్వరూపవేదివి ధర్మాత్మజుండవు నీపలుకులు ధర్మవిరుద్ధంబు లని పలుకనోడుదు మయినను

లోకంబునందు నశ్రుతపూర్వం బిది యింక నీతెఱఁగు నీవును
గుంతీదేవియును ధృష్టద్యుమ్నుండును విచారించి యెట్లనిశ్చ
యింతము. 157

## —వ్యాసమహాముని ద్రుపదుని యొద్దకు వచ్చుట.—

ఉ. ఊహితకార్యసిద్ధి యిది యెట్లొకొ తా సమకూరునంచు సం
దేహముఁ బొంది సోమకయుధిష్ఠిరు లున్నఁ దదీయధర్మసం
దేహనివృత్తి పుట్టఁ జనుదెంచెఁ బరాశరసూనుఁ డాత్మతే
జోహృతసూర్యతేజుఁ డగుచున్ దిశలెల్ల వెలుంగుచుండ
గన్. 158

వ. ఇట్లు వచ్చిన కృష్ణద్వైపాయనునకుఁ గుంతీదేవియుఁ బాండ
వపాంచాలురు నతిభక్తి మ్రొక్కి యమ్మహామునిం గాంచ
నమణి మయోచ్చాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధు
లం బూజించియున్న వారల కుశలం బడిగి హితమధుర
సత్యసంభాషణామృతరసప్రవాహసందోహంబున నందఱం
బరమానందహృదయులం జేసియున్న యమ్మునీంద్రునకు
ముకుళితకరకమలుం డయి ద్రుపదుం డిట్లనియె. 159

క. తన పలుకు లోకమెల్లను
గొనియాడఁగఁ దగిన లోకగురుఁ డీయుమునం
దనుఁ డేమేవురమును నీ
తనుమధ్య వివాహమయ్యెడ మని పలికెదున్. 160

క. మీరెఱుఁగనట్టిలోకా
చారముఁ గలదొక్కొ తొల్లి చెప్ప మహాత్ముల్

ధీరమతు లిట్లు సేసిన
వా రెవ్వరుఁ గలరె యీ ప్రవచనోను మతిన్. 161

క. విమల మతి నన్యులకు విష
యమె ధర్మా ధర్మ నిర్ణయము సేయఁగ ది
వ్యాముసీంద్ర దీని సువిచా
రము సేయుము ధర్మసంకరము గాకుండన్. 162

వ. అనిన నాద్రుపదునకుఁ గృష్ణద్వైపాయను సమక్షంబున
ధర్మజుం డి ట్లనియె. 163

చ. నగియును బొంకు నందు వచనంబు నధర్మువునందుఁ జిత్త
[ముం
దగులదు నాకు నెన్నఁడును ధర్మువ వశ్యము నట్లకావునన్
వగవక మాకు నెవ్వరకు పాండులో చనఁగృష్ణ నీఁదగుం
దగదను దుర్విచారములుఁ దక్క వివాహ మొనర్పు మొప్పు
గన్. 164

వ. మఱియుం దొల్లి గౌతమిన్వైన జటిలయను ఋషికూఁతురు
తపఃప్రభావంబున నేడ్వురు ఋషులకు నొక్కతె భార్య
యయ్యెననియును దాక్షాయణియను మునికన్యక యొక్క
నామంబున ప్రచేతసులను బరగిన పదుండ్రకు నొక్కతె
భార్య యయ్యెననియునుఁ గథలు వినంబడునట్లుం గాక 165

ఆ. గురుల లోనఁ బరమగురువుఁ దల్లియు యట్టి
తల్లివచనము విధాత్యకృతము

నన్యథాకరింప నలవియె యనిన నం
దొఱకు నిట్టులనియె ద్రుపద విభుడు. 166

వ. ధర్మసూక్ష్మత నిర్ణయింప మన కశక్యంబు త్రిలోకవం ద్యుండు త్రికాలప్రవర్తన జ్ఞాననిధి యాకృష్ణద్వైపాయ నుండు విచారించి యెద్ది యానతిచ్చునదియ యిప్పుడు కర్తవ్యంబనిన విని యమ్మునివరుండు ద్రుపదున కిట్లనియె.

సీ. ధర్మ తత్వజ్ఞుఁడీ ధర్మతనూజుండు
ధర్మమార్గంబేల తప్పఁబలుకు
దేవతామూర్తియిద్దేవి మాధవియేల
తా నెఱుంగక యనృతంబుఁబలుకు
వీరలపలుకులు వేల్పులౌ తమును
నొక్కండకావున నొండుఁదక్క
యెవ్వరకునుఁ గూతునిచ్చి వివాహంబుఁ
గావింపు మఱి వీరికల తెఱంగు

ఆ. వినగ నిష్టమేని వినుమని ద్రుపదుచే
యూఁది యింటిలోని కొనర నరిగి
తాను నతడునేకతమ యుండి వానికం
తయునుఁజెప్పఁ దొడఁగె ధర్మవిదుఁడు. 168

—{ద్రుపదునకు వేదవ్యాసుండు పంచేంద్రో పాఖ్యానంబు సెప్పుట.}—

వ. తొల్లి నాలాయని యైన యింద్రసేన యనంబరఁగిన పరమ పతివ్రత మౌద్గల్యుండను మునికి భార్యయై కర్మవశంబున

నమ్ముని కుష్ఠవ్యాధి బాధితత్వగస్థి భూతశరీరుండయినవాని
వయోవృద్ధు వలీపలితతనుదుర్గంధవదను నతిదుఃఖజీవు నతి
కోపను విశీర్యమాణనఖత్వచుం బరమభక్తి నారాధించి
తదుచ్ఛిష్టంబ కుడుచుచున్న నొక్కనాఁడు. 169

తే. కుడుచు నెడ వాని పెను వ్రేలుఁ గూటిలోనఁ
దునిసి పడనట్టి వ్రేల్ పుచ్చి తోయజాక్షి
యేవగింపక యుచ్ఛిష్ట మిష్టలీలఁ
దగిలి కుడుచుచునున్న న త్తరుణిఁ జూచి. 170

వ. దానిదయిన పతిభక్తికి మెచ్చి మౌద్గల్యుండు ప్రసన్నుం
డయి నీకెద్ది యిష్టంబు వేఁడు మిచ్చెదననిన నది యిట్లనియె
మునీంద్రా నాకుం గామ భోగేచ్ఛ పెద్దయుం గలదు నీవును
నీతపశ్శక్తిం గామరూపధరుండ వయి యీ భీభత్సంబగు
రూపంబుగిడి మనోహరంబయిన రూపంబునం బం
చధా విభక్తుండవయి నన్ను రమియించి కామభోగంబు
లందనుపు మనిన నమ్ముని దాని కిష్టంబైన విధంబున నేను
దేహంబులు దాల్చి మర్త్య దేవలోకంబులయందు బ్రహ్మర్షి
దేవర్షి పూజితుండై సూర్యరథం బెక్కి చని యాకాశగంగా
జలంబుల నాప్లుతుండయి శీతాంశునంశుజాలంబుల వసించి
కైలాసమేరువులయందు క్రీడించుచు ననేక స్థానంబుల ననేక
సహస్రవర్షంబులు నాలాయనియైన యింద్రసేనను భోగించి
తృప్తుండై మౌద్గల్యుండు దాని విడిచి ఘోరతపంబుసేసి
బ్రహ్మమయుం డయిన నది కామభోగంబులం దనియక
కాలవశంబున శరీరంబు విడిచి కాశిరాజను రాజర్షికిం బుట్టి

వెలుఁగుచుం గన్యాత్వంబునఁ బెద్దకాలంబుండి తనదౌర్భాగ్యంబునకు నిర్వేదించి పతిం గోరి పశుపతి నుద్దేశించి యుగ్రతపంబు సేయుచున్నంత. 171

తే. దానికడకుఁ బ్రత్యేకంబు ధర్మవాయు
వాసవాశ్వినుల్ ప్రీతులై వచ్చి దాని
నాత్మదేహాంశజులకు దేహాంతరమునఁ
బత్నిఁగాఁ గోరి రధిక సౌభాగ్యయుక్తి. 172

వ. అది మఱియునుఁ గొండొక కాలంబు జలానిలాహారిణియై కొండొక కాలంబేక పాదంబున నిల్చి కొండొక కాలంబు పంచాగ్నిమధ్యంబున నిల్చి యత్యుగ్రతపంబుఁ జేసినఁ బ్రసన్నుండయి యీశ్వరుండు వరంబు వేఁడు మనిన నక్కన్యక నాకుం బతిదానంబుఁ బ్రసాదింపు మని యర్థిత్వంబున నేను మాఱులు వేఁడినం గరుణించి నీకు దేహాంతరంబునఁ బతులేవు రగుదు రనిన నది యిట్లనియె. 173

ఆ. సతికి నొక్కరుండ పతిగాక యెందును
బతులు పలువురగుట కతలఁగలదె
లోకనాథ యిట్టిలోక విరుద్ధంపు
వరము వడయ నమరవరద యొల్ల. 174

వ. అనిన దానికి రుద్రుం డిట్లనియె. 175

క. నావచనంబున నీకగు
నేవురు పతులందు ధర్మ వెడపక యుండుం
గావున నిట్టివరం బిం
దీవరదళనేత్ర యిచ్చితిని దయతోడన్.

వ. అనిన నక్కన్నెని వయ్యేవురుపతులయందును సాటిఁ బ్రత్యేక
సంగమంబును గౌమారత్వంబునుఁ బతిశుశ్రూషయు భోగే
చ్ఛయు సౌభాగ్యంబునుం బ్రసాదింపవలయుననిన రుద్రుండు
దానికోరినవరంబు లెల్లనిచ్చి గంగాతీరంబుననున్న యింద్రు
నాయొద్దకుం దోడ్కొని రమ్మని పంచిన వల్లె యని. 177

క. దక్షాధ్వర మథనునకుఁ బ్ర
దక్షిణపూర్వముగ మ్రొక్కి తడయక చని ప
ద్మేక్షణ సహస్రచక్షుఁ బ్ర
తీక్షించుచునుండె సురనదీ తీరమునన్. 178

వ. అట్లు వైవస్వతుండును నైమిశారణ్యంబున సత్త్రయాగదీక్షి
తుండయి ప్రాణిహింసకు నోపకుండుటం జేసి మానవు లప్రా
ప్తమరణులయి వర్తించుచున్న సహింపనోపక యింద్రాది
దేవతలందఱుఁ బ్రహ్మపాలికిం జని భట్టారకా మర్త్యులెల్ల
నమర్త్యులయి వరిల్లుచుందురు కావున వారికిని మాకును విశే
షం బెద్దియని దుఃఖించిన నమరులకు నమరజ్యేష్ఠుం డిట్లనియె.

క. ఇంతకుఁ గృతకార్యుండగు
నంతకుఁ డీరంతకును భయం బందక ని
శ్చింతముగ నుండుఁ డాతం
డంతము నొందించుఁ దొట్టియట్టుల జనులన్. 180

క. ఆవైవస్వతు వీర్యము
మీవీర్యముఁ దాల్చి సూర్యమిత తేజులు వా
రేవు రుదయింతు రాతని
కావించు విధానములకుఁ గారణ మగుచున్. 181

వ. అనిన నమరపతిపురోగము లయిన యమరులెల్ల నమరా
పగాసమీపంబునకుం జనునప్పుడు తత్సలిలమధ్యంబున
నొక్కకన్యక యేడ్చుచున్నదాని కన్నీళ్ళు కనకకమలంబు
లయినం జూచి వేల్పులుందానును విస్మయంబంది యక్కన్య
యెద్దకుంజని యింద్రుండెందుల దాన వేల యేడ్చెద వని
యడిగిన నది యింద్రున కిట్లనియె. 182

ఆ. నాదురోదనంబుఁ నన్ను నెఱుంగఁగ
వలతువేని నమర వల్లభుండ
నాపిఱుంద రమ్ము నావుడు నప్పుడ
వ్వనితపజ్జ నఱిగె వాసవుండు. 183

వ. ఇట్లక్కన్యపిఱుంద నలుగువాఁడు ముందర హిమవదచలకం
దరాగ్రవిరచిత రత్నవేదికాతలంబున సింహాసనాసీనుండయి
వరుణరూపంబున నొక్కతరుణితో జూదంబాడుచున్నయాది
దేవుంగని వరుణుండ కా వగచి సురపతి కరంబలిగి యిట్ల
నియె. 184

మ. అమితస్థావర జంగమంబయిన బ్రహ్మాండంబుఁదానంతయున్
మమతాగోచర మీత్రిలోకములు నస్మద్బాహువజ్రానుపా
ల్యములే నింద్రుఁడ నిట్టినన్నుఁబకలీలన్ జూదమాడఁగ ను
త్తమ సింహాసనమెక్కనీకుఁ జనునే దర్పించి నాముందటన్.

వ. అనిన నలిగి రుద్రుండు రౌద్రాకారంబున వానింజూచి మదీ
యక్రీడా రసభంగంబుఁ జేసిన యద్దురాత్మునిం బట్టితెమ్మని
యక్కన్యకం బంచిన నప్పుడు దాని కరస్పర్శనంబునం దూలి

నిక్షేపితుండయి మహీతలంబునంబడిన యయ్యింద్రునకు రుద్రుం డిట్లనియె. 186

క. గర్వించి పలికితివి నీ
గర్వము భుజవీర్యమును బ్రకాశంబుగ నీ
పర్వత శిఖరం బెత్తి వి
గుర్వింపుము చూతమనిన గోత్రభిదుండున్. 187

సీ. హరువచనమున నా గిరిరాజ శిఖరంబు
గరములఁ బట్టి చెచ్చెర దినేశ
చండమయూఖముల్ రెండువిధంబులై
యుండంగ దీర్చి యాఖండలుండు
దనయట్టివారల ఘనశరీరుల నందు
నలువుర నన్యుల వెలయఁజూచి
యేనిట్టులేలొకో యేనుప్రకారంబు
లయితి నిం దనుచు విస్మయముఁ బొంది

ఆ. యున్నఁజూచి హరుడు గ్రన్నన యింద్రుల
నేవురను మహాను భావమెసఁగ
మనుజయోనిఁ బుట్టుఁ డని పంచె గీర్వాణ
హితముసేయు పొంటె మతిఁ దలంచి. 188

వ. వారలు ధర్మానిలశక్రాశ్వినులు దమకు నాధారకర్తలుగా ధర్మజ భీమార్జున నకుల సహదేవులయి యేవురుఁబుట్టిరి మఱి కమలభవ ప్రముఖనిఖిల సురగణ ప్రార్థితుండయిన నారాయణు సితాసితకేశ ద్వయంబు బలదేవ వాసుదేవులై దేవహితార్థం బుద్భవిల్లె నందు వాసుదేవుండు వారలకుఁ

గార్యసహాయుండయ్యె నయ్యైందు్రల కేవురకును నేకపత్నిగా దపంబు సేసి శ్రీమూర్తియయిన యాజ్ఞసేని యజ్ఞవేదింబుట్టె నమ్మవేని వీరలపూర్వదేహంబులు జూడుమని కృష్ణద్వైపాయనుండు దు్రపదునకు దివ్యదృష్టి యిచ్చి చూపిన. 189

ఉ. చారుమణిప్రభాపటలజాల విచిత్రకిరీట మాలికా
భారములన్ సముద్యదినపావకవర్ణములన్ సువర్ణ కే
యూరవిభూషణావళుల నొప్పుచునున్న తదీయదేహముల్
ధీరుఁడు సూచెఁ దాళసమదీర్ఘతఁ బొల్చినవాని నేనిటన్. 190

వ. మఱియు సకలలావణ్యమూర్తియై వారలకేవురకుఁ బత్నిగా దపంబు సేసిన యక్కన్యక పూర్వదేహంబునుంజూచి విస్మితుండయి హర్షించియున్న దు్రపదునకు వెండియుం గృష్ణద్వైపాయనుం డిట్లనియెఁ దొల్లి నితంతుండను రాజర్షి కొడుకు లనంతబలపరాక్రములు సాల్వేయ శూరసేన శు్రతసేన సేనాబిందు సారాతిసారులను వారేవురుం బరస్పరస్నేహంబుల నతిప్రసిద్ధులయి పెరుఁగుచు నౌశీనరపతి కన్యక నజిత యనుదాని స్వయంవరంబునఁ బడసి వివాహంబయిరి. 191

క. కాంతివిశేష విలాసా
నంతశ్రీఁ దనరు నజితయం దనఘులు నై
తంతువులేవురుఁ బడసిరి
సంతానము వేఱువేఱ సత్కులమెసఁగన్. 192

వ. తొల్లింటి మహాత్ములయందును నిట్టిచరితంబులు గలవు కావునఁ బాండవులకేవురకు ద్రౌపదిం గ్రమంబునఁ బాణి

నిక్షేపితుండయి మహీతలంబునంబడిన యయ్యింద్రునకు రుద్రుం డిట్లనియె. 186

క. గర్వించి పలికితివి నీ
గర్వము భుజవీర్యమును బ్రకాశంబుగ నీ
పర్వత శిఖరం బెత్తివి
గుర్వింపుము చూతమనిన గోత్రభిదుండున్. 187

సీ. హరువచనమున నా గిరిరాజ శిఖరంబు
గరములఁ బట్టి చెచ్చెర దినేశ
చండమయూఖముల్ రెండువిధంబులై
యుండంగ దీర్చి యాఖండలుండు
దనయట్టివారల ఘనశరీరుల నందు
నలువుర నన్యుల వెలయఁజూచి
యేనిట్టులేలొకో యేనుప్రకారంబు
లయితి నిం దనుచు విస్మయముఁ బొంది

ఆ. యున్నఁజూచి హరుడు గ్రన్నన యింద్రుల
నేవురను మహాను భావమెసఁగ
మనుజయోనిఁ బుట్టుఁ డని పంచె గీర్వాణ
హితముసేయు పొంటె మతిఁ దలంచి. 188

వ. వారలు ధర్మానిలశక్రాశ్వినులు దమకు నాధారకర్తలుగా ధర్మజ భీమార్జున నకుల సహదేవులయి యేవురుఁబుట్టిరి మఱి కమలభవ ప్రముఖనిఖిల సురగణ ప్రార్థితుండయిన నారాయణు సితాసితకేశ ద్వయంబు బలదేవ వాసుదేవు లై దేవహితార్థం బుద్భవిల్లె నందు వాసుదేవుండు వారలకుఁ

గ్రహణంబు సేయింపు మిది మనచేసినయదిగాదు దైవాధిష్ఠితంబని ద్రుపదు నొడంబఱిచి కుంతియుఁ బాండవులునున్నచోటికి ద్రుపదరాజసహితుం డయివచ్చి కృష్ణద్వైపాయనుండు యుధిష్ఠిరున కిట్లనియె. 193

—ద్రౌపదీ వివాహ మహోత్సవము.—

ఆ. నేడుపుణ్యదినము నెమ్మితో రోహిణీ
యుక్తుఁడయి శశాంకుఁ డున్నవాఁడు
మంత్రవంతముగఁ గ్రమంబున నేవురుఁ
బెండ్లియగుఁడు కృష్ణఁ బ్రీతితోడ 194

వ. అని నిశ్చయించి పంచినం బాంచాలపతియును గరంబనురాగంబునఁ బురంబిష్ట శోభనంబుసేయించి సమారబ్ధ వివాహోత్సవుం డయ్యెనంత నిరంతరక్రముక కదళీస్తంభ సంభృతనవాశ్వత్థ పల్లవమాలాలంకృత ద్వారతోరణంబులను చందనోదకసంసిక్త ప్రాంగణరంగవల్లీ కర్పూరమౌక్తిక ప్రకరంబులనుఁ గౌతుకోత్సవ మంగళశృంగార వారాంగనా ప్రవర్తమానస్వనియోగకృత్యంబులను నుత్సవసందర్శనాగతానేకరాజన్య సుహృద్బాంధవ సంకులత్వంబుననుం జేసి యొప్పుచున్న ద్రుపదరాజమందిరంబునం బూర్వోత్తర దిగ్భాగంబున విచిత్రనేత్ర విరచితవితాన మౌక్తిక కుసుమ మాలికాలంకృతంబును సమీచీన చీనాంశుక విరచిత స్తంభవేష్టనంబునుఁ బ్రత్యగ్రపల్లవ శాల్యతండులాంచిత కాంచనపూర్ణ కలశోపశోభితంబును లాజాజ్య పూర్ణ సువర్ణ పాత్ర సమిత్కుశ పలాశాభి రమ్యంబును నవగోమయశ్యా

మమరకతమణి ప్రభాపటల విలిప్త హిరణ్మయ వేదీమధ్య
సమిద్ధాగ్ని కుండమండితంబును నయినవివాహమంటపం
బునకుం జని నిజపురోహితుం డయిన ధౌమ్యుండాదిగా
ననేక విద్వన్మహీసుర నివహంబుతోఁ గరం బొప్పి. 195

సీ. అనఘులు కృతమంగళాభిషేకులు ధృత
సముచిత వేషప్రశస్త రత్న
భూషణుల్ కౌరవ పుంగవు లేవురు
నేతెంచి రంతఁ బూర్ణేందువదన
యధిక విదగ్ధ పుణ్యాంగనా విరచిత
లలితప్రసాధనాలంకృతాంగి
కమలాక్షి కమనీయ కాంతా సహస్రంబు
తోఁ జనుదెంచె నాద్రుపద తనయ

ఆ. భూరిభూసురేంద్ర పుణ్యాహరవమును
మంగళప్రగీత మధుర రవము
వివిధ తూర్యవేణువీణారవంబును
విస్తరిల్లె విపుల విభవయుక్తి. 196

క. వితతప్రదక్షిణావ
ర్తిత దీప్త శిఖానలమున ధృతిఁ వేల్చెఁ బురో
హితుఁ డగుధౌమ్యుఁడు బుధ స
మ్మతుఁడు వివాహప్రయుక్తమంత్రాహుతులన్. 197

వ. ఇట్లు వేల్చి ధర్మపుత్రునకు ద్రుపదరాజపుత్రిం బాణి
గ్రహణంబు సేయించి తొల్లి యేవురకు వివాహంబు సేయు
నప్పుడు కన్యాత్వంబు దూషితంబు కాకుండ నీశ్వరుని

వరంబునం గౌమారంబు వడసినయక్కన్యకం గ్రమంబున
భీమార్జున నకులసహదేవులకుఁ బాణిగ్రహణంబు సేయించిన
తే. జనుల యాశీరవంబును జెదలఁ దేవ
దుందుభినినాదములును బంధుర సుగంధ
మందగంధవహామోదమాన కుసుమ
వృష్టియును ముహాముదముతో విస్తరిల్లె. 199
వ. అని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పెనని. 200
క. విద్యావిలాస పార్థివ
విద్యాధర నిఖిలరాజవిద్యానిధి శీ
తద్యుతివిశదయశః ప్రస
రద్యోతిత సర్వలోకరాజ మహేంద్రా 201

స్వాగతము.

రాజరాజగుణ రాజివిరాజ
త్తేజ రాజకులదీప విశిష్టాం
భోజమిత్ర నృప పూజిత పాదాం
భోజ భూ వినుతపుణ్యవరేణ్యా. 202

గద్యము. ఇది సకలసుకవిజన వినుత నన్నయభట్ట ప్రణీతం
బయిన శ్రీమహాభారతంబునం దాదిపర్వంబున ధృష్ట
ద్యుమ్న ద్రౌపదీ సంభవ కథనంబును కృష్ణద్వైపాయన
సందర్శనంబును గంగాతీరంబున నంగారపర్ణు నర్జునుండు
జయించుటయు (దాపత్య వశిష్ఠార్వో పాఖ్యానంబును)
ద్రౌపదీ స్వయంవరంబునుఁ బంచేంద్రోపాఖ్యానంబును
ద్రౌపదీ వివాహంబును నన్నది సప్తమాశ్వాసము. 203

---

# ద్రౌపదీస్వయంవరము.

## పాండవుల పూర్వవృత్తాంతము.

పూర్వకాలమున నుత్తరహిందూస్థానమున హస్తినాపురమను నొకపట్టణము యమునాతీరమున నుండెను. ఇప్పటి ఢిల్లీనగర మదియే. దానిని ద్వాపరయుగాంతమున చంద్రవంశపు రాజు లేలుచుండిరి. వారిలో కురుఁడను రాజొకఁడుండెను. అతని సంతతివారు కురువంశ మనుపేరు పొందిరి. రానురాను విచిత్రవీర్యుఁడనురా జచ్చట పాలించుచుండెను. అతనికి ధృతరాష్ట్రుఁడు పాండురాజు అనునిద్దరు కుమారు లుండిరి. ధృతరాష్ట్రునకు దుర్యోధనుఁడు దుశ్శాసనుఁడు మొదలగు నూర్వురు కొడుకులు పుట్టిరి. పాండురాజునకు ధర్మరాజు భీముఁడు అర్జునుఁడు నకులుఁడు సహదేవుఁడు అను నేవురు కొడుకులు పుట్టిరి. వీరు పాండవు లనబడుచున్నారు. ధృతరాష్ట్రనందనులు కౌరవులనఁబడుచున్నారు.

పాండవు లందఱును దేవాంశములచే జన్మించినవారు. వారు ధర్మశీలురు, సర్వజనసమ్మత మగునడవడి గలవారు, సత్యసంధులు. కౌరవులు రాక్షసాంశలచే జన్మించినవారు. వారు మత్సరగొట్లు దుశ్శీలురు దుర్మార్గులు. కావున కౌరవపాండవులకు సహజవైర ముండెను. కనుక దుర్యోధనాదులు పాండవులను మొదటినుండియు బాధింపుచు వారిని చంపఁబ్రయత్నించుచునుండువారు. ఒకమారు వారిని గంగానదిలో త్రోయించిరి. గాని దైవవశమున వారు బ్రతికిరి. తండ్రియనుమతినిబొంది దుర్యోధనుఁడు పాండవులను వారణావతమునకుఁబంపి యచ్చట నొకలక్కయింటిని కట్టించి దానిలో వారునివసించునట్లుచేసి యాయింటిని కాల్పించెను. ఇట్లు జరుగుచుండ పాండ

పులయెడల నభిమానము గలవిదురుఁడు దుర్యోధనుని దురాలోచనల నెఱింగి రహస్యముగఁ దనసొంత మనుష్యులచేత నాలక్కయింటినుండి వెలుపడుటకు నొకసొరంగము రచింపించి యాసమాచారమును పాండవులకు తెలియఁజేసెను. వారును లక్కయిల్లు కాలునపుడు ఆబిలద్వారమున వెలువడి బ్రతికిరి. కాని వారు లక్కయింటిలో మ్రగ్గిరని లోకవిదిత మయ్యెను. దుర్యోధనాదులు వారికి నుత్తరక్రియలఁగూడఁ గావించిరి. తరువాత పాండవులును కుంతియు పోయిపోయి యేకచక్రపురంబను నొకగ్రామముచేరి యచ్చట విప్రవేషధారులై యొకవిప్రునింట బసచేసికొని మధూకరమెత్తుచు జీవించుచుండిరి. అచ్చట కొంత కాలముగడపిన పిదప నొకబ్రాహ్మణుఁ డచ్చటకు వచ్చిన నతనివలన ద్రౌపదీసంభవంబును స్వయంవరప్రకటనమును వినినవారలై తాము ద్రుపదుపురంబునకుఁ జనిరి.

# ద్రౌపదీస్వయంవరము - టిప్పణములు.

---

ఇందు మూలగ్రంథమున గుర్తుపెట్టఁదగినట్టియు సందర్భానుసార ముగ తెలుపవలసినట్టియు నంశములు సూచింపఁబడును.

మహాభారతము — మహత్త్వను భారవంతమును కలదిగాన నీగ్రంథమున కీపేరు కలిగెను. భారతవంశపు రాజుల చరిత్రము గావునను భారతమను పేరు కలిగెను. భారతములోనిభాగములకు పర్వము లనిపేరు. ఇటులనే రామాయణ మునందలి భాగములకు కాండములనియు భాగవతమునందలిభాగములకు స్కంధములనియు పేరులున్నవి. పర్వమునందలి భాగములు ఆశ్వాసము లనబడును.

1-వ పద్యము:...ఇది కృతిపతియగు రాజరాజ నరేంద్రునిస్తుతి. గ్రంథాదియందును ప్రతిఆశ్వాసాద్యంతములయందును కవి కృతిపతినిస్తుతించుటయు నాతనితో గ్రంథాంశమును వినిపించుచున్నట్లు వ్రాయుటయు నాంధ్రకవి సంప్రదాయములై యున్నవి.

ఈరాజరాజనరేంద్రుఁడు రాజమహేంద్రవరమును పూర్వమున పాలించుచుండిన రాజు. ఇతడిప్పటికి సుమారు 900 సంవత్సరముల క్రిందటివాడు. ఇతని కుమారుడే సారంగధరుఁడు, భార్య చిత్రాంగి. వీరియందలి చిహ్నములును ఇప్పటికిని రాజమహేంద్రవరమున గన్పట్టుచున్నవి.

ఈగ్రంథమును రచించినకవి నన్నయభట్టు. ఇతఁడు రాజరాజ నరేంద్రుని 'కుల బ్రాహ్మణుఁడు;' అనఁగనతని పురోహితుండనఁబోలు. ఇతఁడు యజుర్వేది; ముద్గలగోత్రుఁడు. ఇతఁడు తానురచించిన భారతగ్రంథమును రాజరాజ నరేంద్రునకంకితమొనర్చెను. కావున నీపద్యమును ఆశ్వాసాదిని రచించెను.

ఈపద్యమునందలి సమాసపదములు కృతిపతిసంబుద్ధులు. శ్రీరాజరాజ! వీరశ్రీరమణీరమ్య! గంధసింధురహయశిక్షారూఢిదక్ష! దక్షమఖారిదయాలబ్ధ సుస్థిరైశ్వర్యపదా!

దక్షమఖారి = శివుఁడు: శివుఁడు దక్షప్రజాపతి చేయుచుండిన యజ్ఞము ధ్వంసముచేయుటచే నతని కీపేరు కలిగెను.

శివుఁడు దక్షునియల్లుడు. పూర్వమొకానొకప్పుడు బ్రహ్మచేయుచుండిన యజ్ఞమునకు దేవతలు ఋషులు మొదలగు మహనీయులచ్చటకు వచ్చియుండిన సమయమున దక్షుఁడు వచ్చెను. అప్పుడందఱును లేచి యాతని గౌరవించిరి. కాని శివుఁడట్లు చేయలేదు. అందులకు దక్షుఁడు కోపగించి శివుని దురుక్తులాడి యాతనిమీద క్రోధము పూనెను. తరువాత నొకప్పుడు దక్షుఁడు యజ్ఞముచేయుచు శివుని పిలువలేదు. అయినను శివుని భార్యసతీదేవి తనతండ్రిచేయు సవనముయొక్క విభవము చూడఁ గోరియు తనపుట్టింటి బంధుమిత్రులను గని యానందింపఁ గోరియు శివుని ప్రయాణముచేసెను. ఆయన పూర్వవైరముకతమున నందులకు సమ్మతింపకుండిన సతీదేవి తాను మాత్రము వెళ్లెను. కాని దక్షుఁడు తనకూతుం జూచియు నిరాకరించెను. అందులకామె వ్యసనపడి తన భర్తయెడల నాతఁడొనర్చిన యపరాధములఁదలచికొని యచ్చటనే దేహత్యాగముచేసెను. ఈసమాచారము శివునకుఁ దెలిసిన నతఁడెంతేని దుఃఖించి తనజటనుభూమిపైని గొట్ట నందు వీరభద్రుండుద్భవిల్లి దక్షునియజ్ఞవాటికకుఁబోయి యందలివారినందఱ నుక్కడచి యజ్ఞధ్వంసము గావించెను.

ఈ పద్యమున 'ఆరూఢిదక్ష' 'దక్షమఖారి' యనుచో ముక్తపదగ్రస్తమను నలంకారము గన్పట్టుచున్నది.

2-వ పద్యము :—కథకుఁడు=ఉగ్రశ్రవసుండను పేరుగల యొకసూతుఁడు, ఇతఁడువ్యాసుని శిష్యుఁడు, శూద్రజాతివాఁడు. శౌనకాదిమహామును

లందఱును ద్వాదశవార్షికంబగు సత్రయాగముచేయుచుండ సూతుం డచ్చటకువచ్చి వారికోరిక ప్రకార మనేక పురాణ కథలఁ జెప్పెను. అవియన్నియుఁజేరి యనేక గ్రంథము లైనవి. వానిలో భారత మొకటి.

మహామునులకుంజెప్పె: ఇచ్చట షష్ఠి ప్రాచీన ప్రయోగము. పాండవులేవురును వారి తల్లికుంతియు వారణావతియందు దుర్యోధనునిచే నిర్మింపఁబడిన లక్కయింటనుండ నాయి ల్లాతనియాజ్ఞచే కాల్పఁబడెను. విదురుని రహస్య సహాయమువలన వారందఱి బిలద్వారమార్గమున నిర్గమించి ప్రచ్ఛన్నులై బ్రాహ్మణవేషధారులై యేకచక్రపురంబుఁ జేరిరి. వా రందఱును దగ్ధలాక్షా గృహంబున ప్రమగ్గి రని లోకవిదితం బయ్యెను. దుర్యోధనాదులు వారికి నుత్తరక్రియలఁగూడఁ జేసిరి.

సుఖమున్నన్ = సుఖముతో నుండగా: ఇచ్చట తృతీయార్థమందు ప్రథమ.

ద్రుపదుపురము—కాంపిల్యనగరము. పాంచాలదేశపు రాజధాని. ఈ దేశము నే యిప్పుడు పంజాబందురు. అభ్యాగతపూజలు=పరదేశికి చేయవలసిన యుపచారములు; కాళ్లుచేతులు కడిగికొనుటకు నీళ్లనిచ్చుట దాహశాంతి చేయుట విసరుట మొదలగు విశ్రాంతి కొఱకగు నుపచారంబులు చేయుట. ఇది మన పూర్వుల సదాచారములలో నొకటి.

3:—ద్రుపదేశు దేశమున్=దేశముతో-తృతీయార్థమందు ద్వితీయ. ఈ పద్యమువలన బ్రాహ్మణులు సాధారణముగ దేశాటనపరు లనియు, వారివలన రాచకార్యవార్తలు లోనగునవి ప్రచురము లగుచుండు ననియుఁ దెలియుచున్నది.

4. కూతున్-దీని ప్రథమ కూతురు. అగ్నికుండసముద్భవ=యజ్ఞమునకై చేయఁబడిన యగ్ని వేదియందు బుట్టినది. అయోనిజ= తల్లిగర్భమునఁబుట్ట

నిది; అగ్నికుండసముద్భవ కాన నయోనిజ-ఇటులనే సీత భూమిజ గాన నయోనిజ యయ్యె-పూర్వకాలముననిట్టి జన్మంబులుబహుళంబుగ నుండినట్లు గ్రంథములవలన కానంబడుచున్నది. అగణ్య పుణ్యలావణ్య- ఇచ్చట అను ప్రాసమను శబ్దాలంకారము. అభిమతుండైన రాజపుత్రునకు: ఇచ్చటి సందర్భమున నర్జునునకని యభిప్రాయము. స్వయంవరము = కన్యక స్వయముగా పురుషుని వరించుట; ఇదియొక వివాహ భేదము-క్షత్రియులకు విహితము. స్వయంవరము రెండు విధములుగఁ గన్పట్టుచున్నది:—

(1)కన్యకతండ్రి రాజుల నందఱను పిలిపించి వారిని కన్యకకు చూపిన పిదప కన్యక తన యిష్టమువచ్చిన పురుషుని వరించుట. ఇదియే సార్థకమగు స్వయంవరము. దీనికి దృష్టాంతము దమయంతీ స్వయంవరము. (2) కన్యక తండ్రి యొకపణము నిర్ణయించి దానిని నెరవేర్చిన పురుషునకు కన్యనిచ్చుట. ఇది స్వయంవరమనఁబడుచున్నదే గాని యర్థతః స్వయంవరము కానేరదు. దీనికిదృష్టాంతములు సీతాస్వయంవరము ద్రౌపదీస్వయంవరము. ఈవివాహము శాస్త్రవిహితములగు అష్టవిధవివాహములలో నొకటిగాదు. పూర్వాచారమే దీనికి ప్రమాణ మని కన్పట్టుచున్నది. ఈవిషయము విచారణీయము. రచియించుచున్నవాఁడు—ఇదియొక ప్రాచీన గ్రాంథిక ప్రయోగము. ఆధునిక పద్ధతిని 'రచియించుచున్నాఁడు' అని యందురు.

5. కలశము = పాత్ర. శబ్దాంతరము-ద్రోణము. ద్రోణమునఁ బుట్టినవాఁడు గాన ద్రోణుడను పేరు కలిగెను. పూర్వమున భరద్వాజుఁడను ముని గంగాతీరంబున స్నానముచేయుచుండ నొక గంధర్వస్త్రీయగు ఘృతాచి యచ్చటకువచ్చి స్నానముచేయుచుండగానామెకట్టుబట్టసడలిన నది యామునిదృష్టిపథమున బడెను. అందువలన నాతనికి రేతస్ఖలనమయ్యెను. అట్టి రేతస్సును ద్రోణమున నుంచిన నది వృద్ధిబొంది ద్రోణుఁడయ్యెను. ఇట్టి జన్మం

బులుపూర్వమున నుండినట్లు గ్రంథములఁ గన్పట్టుచున్నది. అగస్త్యులిటులనే కుంభమునఁ బుట్టెనుగానఁ గుంభజుఁడను పేరాతనికిఁ బ్రసిద్ధమయ్యెను.

ధనుర్వేదము=ధనుర్విద్య; ఇది వేదములలో నొకటిగాదు. ఇచ్చట వేదమన విద్యయని యెఱుంగునది. ఇటులనే ఆయుర్వేదము· విద్యలనేకములు గలవు. వీనిని కళలని తరచుగ నందురు.

అగ్నివేశులతోఁడ=అగ్నివేశులను గురువులనొద్ద. ఇచ్చటతోఁడ ప్రత్యయమునకు విశేషార్థము ప్రాచీనగ్రంథస్థము.

భారద్వాజుఁడు=భరద్వాజుని కొడుకు. అపత్యవాచకము. ఇటులనే దశరథుని కొడుకు దాశరథి.

శస్త్రాస్త్రవిదులు=శస్త్రములు అస్త్రములు తెలిసినవారు. శస్త్రములు=ఆయుధములు-అస్త్రములు=మంత్ర తంత్రాత్మకంబులగుశత్రుసంహారసాధనములు. వానిచేత నవమానితాత్ముఁడై-ద్రోణుఁడు ధనేచ్ఛచే తనబాలసఖుం డగు ద్రుపదునొద్దకుంబోయిన నతండు గర్వాతిరేకంబున ద్రోణుని నిరాకరించెను.

6. పాండవకురుకుమారులు = పాండవ కుమారులు కురుకుమారులు. పాండవులుకూడ కురువంశము లోనివారలయ్యును వివక్షకొఱకు వారు పాండవు లనబడుచుందురు. వంశవృక్షమును చూడుఁడు. గురుదక్షిణ=శిష్యులు తమ విద్యాభ్యాసాంతమున గురువులకు బహుమానములనిచ్చు నాచారము గలదు. అది తరచుగ గురువు కోరినదియై యుండును.

7. అవమాన తప్తుడు=అవమాన మను నగ్నిచే కాల్పబడినవాడు. ఇచ్చట గూఢరూపకము.

8. పడయుదునని=పొందఁగోరి బ్రహ్మవిదులు = బ్రహ్మజ్ఞానముకలవారు. వానప్రస్థవృత్తి-ద్విజులకు నాలుగుఆశ్రమములు బ్రహ్మచర్యముగార్హస్థ్యము వానప్రస్థము సన్యాసము అనునవి. పురుషుఁడు సంతానవంతుఁడైన

పిదప భార్యతో వనమునకేగి యచ్చట తపమొనరించుచుండుట వానప్రస్థవృత్తి. కొండిక=పిన్నవయస్సువాఁడు పెద్ద=అధికుఁడు.

9. గోధేనువులన్ = గోవులను ధేనువులను; ధేనువులనఁ దొలిచూఁత యావులు. పూర్వము బ్రాహ్మణులకు గోవులే ధనమని గన్పట్టుచున్నది. వారి హవ్యకవ్యములకు నవి మిగుల నావశ్యకములై యుండెడివి. వారికి ధన మనున దంత యవసరమగునది కానట్టు కన్పట్టును. సత్పుత్రజననం బగునట్టి క్రతువు: ప్రతికోరికయుఁ దీర్చికొనుటకుఁ దగిన క్రతువులు గలవనియు వాని నొనరించిన నట్టికోరికలు తీరుననియు నాకాలమునాటివారి నమ్మకము. ఇటు లనే దశరథుఁడు పుత్రకామేష్టి యొనరించి కొడుకులఁ గనినట్టు సుప్రసిద్ధము.

10. దీనివలన నాకాలమునాటి బ్రాహ్మణుల నిర్లిప్తతయుఁ దృష్ణా రాహిత్యమును కన్పట్టుచున్నవి. బ్రాహ్మణులు ప్రతిగ్రహింపకుండుట యుత్తమ ధర్మమని నమ్మి దాని నవలంబించుచుండిరి.

11. ఉపయాజుఁడు యాజుని స్వభావనిరూపణముఁజేసిన తెఱఁగు గుర్తింపనగును. అతని యభిప్రాయమునకనుకూలముగనే యాజుఁడొడంబడెను.

12. ఫలార్థి యయినవాఁడు తత్ఫలానుబంధంబయినదోషంబు పరికిం పఁడు.ఇది లోకసామాన్య ధర్మము. ఉత్తమ పురుషు లట్లు యోచింపరు.

పంచమహాయజ్ఞంబులు—1 వేదమునుపఠించుట 2 హోమము 3 అతిథి పూజ 4 తర్పణము; ఋషితర్పణము, పితృతర్పణము మొదలగునవి. 5 బలి హరణము. ఇవి యైదును బ్రాహ్మణులకు విధులు—శిలోంఛవృత్తి-కోటి దగ్గరను పొలములలోను పడినగింజల నేరికొని జీవించుట.

15. ఆచార్యుఁడు=గురువు;ఆచారమును గ్రహింపఁజేయువాడు-భారత వంశము=భరతుని వంశము. ఈ భరతుఁడు దుష్యంతునకును శకుంతలకును కలిగినవాఁడు. చంద్రవంశపురాజు. వంశవృక్షము చూడుఁడు.

16. షడరత్ని=షట్+అరత్ని; [అరత్నియనఁగా, చిటికినవాచిన మూర. ] ఆరుమూరలు-చతుర్వర్గము = చతుః+వర్గము-నాలుగింటిసమూహము; ధర్మార్థకామమోక్షములు నాలుగింటికిని చతుర్వర్గమను వాడుక కలిగెను.

17. కోర్కి- (ధా-కోరు) కోరిక-కోరికి—ఓడకుండుము = విచారింప కుండుము. సౌత్రామణి=ఇదియొకక్రతువిశేషము. ఈక్రతువు చేయుటవలన సౌత్రామణియయ్యె. పుత్రకామేష్టి=పుత్రులను పొందఁగోరి చేసెడి ఇష్టి.

20. ఉత్పలము = కలువ-మహోత్పలము = పద్మము.

21. ఆకాశవాణి = ఆకాశమునుండి వెడలిన శబ్దము. మింట వినఁబడు మాట. ఇట్లు ఆకాశంబున దేవనిర్దేశములును భావిసూచకములును వినఁబడునను నది గ్రంథస్థము. ప్రస్తుతలోకానుభవమునకు విరుద్ధము. ధనుర్వేదపారగుఁడు= ధనుర్వేదమును పూర్తిగ నేర్చినవాఁడు; పారగుఁడు=పారమును చేరినవాఁడు. అవతలి యొడ్డునకు వెళ్లినవాఁడు. వివాహప్రాప్త = పెండ్లియీడువచ్చినది, వివాహకాలప్రాప్త.

22. పాండవకుమారులుఁ గుంతియు లక్కయింట సుగ్రానలదగ్ధులై రని: పాండవుల పూర్వవృత్తాంతమును చూడుఁడు...ఆతత శోకమహానల జ్వాలనాన్మనసుఁడయ్యె; ఇచ్చట శోకము అగ్నితో పోల్చబడెను. వెనుక 7-వ. ప. లో అవమానతప్తుఁడు అనునది కూడ నిట్టిదియే.

24. నిమిత్తములు=ప్రశ్నలు. ఎగ్గు-లగ్గు; విరుద్ధార్థకములు. పురోహితుండు దా నిట్లు లనియె. ఇచ్చట 'దా' అత్యుక్తి; ఇది ప్రాచీనశైలీ విశేషము.

25. ఉపశ్రుతి:తమభాషణ మప్పుడు వినఁబడు శుభాశుభ సూచకము లగు అన్యసంభాషణాది శ్రవణము. ఇట్లుచూడఁ దలచినవారు రాత్రివేళ నక్షతలు తీసికొని యొకయింటికిఁబోయి ఆయక్షతలఁజల్లి ఆయింటి పంచక్రింద వేచి యింటిలోపలివారు పలికెడు మాటలను కనిపెట్టి వాని లక్షణమునుబట్టి తాముతలచిన కార్యముయొక్క అనుకూల్య ప్రాతికూల్యములను నిర్ణయించెదరు.

"నీవును సుచిత్తుండవయి స్వయంవరం బిప్పురంబున ఘోషింపంబంపు మిది కన్యాదానంబునందు రాజులకు శాస్త్రిచోదితంబు"-స్వయంవరము మనువుచెప్పిన యెనిమిది వివాహములలో నొకటికాదు. అవి బ్రాహ్మ దైవ ఆర్ష ప్రాజాపత్య ఆసుర గాంధర్వ రాక్షసపైశాచములు -మఱి యిది యెట్లు శాస్త్రిచోదితమో యాలోచింపఁదగు.

'పౌషమాసంబునఁ బంచమియు రోహిణినాఁడు.' ఇందొకయసంగతము గన్పట్టుచున్నది. పుష్యశుద్ధ పంచమికిని పౌర్ణమికిని నడుమ తొమ్మిదిదినములు వ్యవధి యున్నది. జ్యోతిస్సిద్ధాంతరీతిని పుష్యశుద్ధ పౌర్ణమి పుష్యమీ నక్షత్రముతో కలియవలెను. రోహిణిపుష్యమికి వెనుక నయిదవ నక్షత్రము. కాగా రోహిణీదివసమునకును పుష్యశుద్ధపౌర్ణమికిని నడుమ మూఁడుదినములే యుండ వలెను. ఇట్లుచూచిన పుష్యశుద్ధ ఏకాదశినాడు రోహిణి కావలెను. మఱి యారు దినముల వెనుకనున్న పంచమినాడు రోహిణియని యున్నది. జ్యోతిర్గణితరీతిని కొంచెము వ్యత్యాసము కలిగినను ఒకటిరెండు దినములు భేదము కనుచున్నారముకాని తొమ్మిదిదినములు వ్యత్యాసము కలుగుటకు కారణమే మియునులేదు. యుగాంతర వ్యవస్థచే నట్టి భేదము కలిగియుండునందుమా త్రేతాయుగాంశమగు శ్రీరామనవమి పునర్వసునక్షత్రములు ఇప్పటికిని సరిపోవుచునే యున్నవి. ద్వాపరాంత విషయంబునుభారతకథా కాలీనంబును నగు శ్రీకృష్ణ జన్మాష్టమియు రోహిణీ నక్షత్రంబును సరిపోవుచునే యున్నవి. కావున నిది యసంగతమని నిశ్చయింపనై యున్నది. ఈవచనమునకు పాఠాంతర మొకటికలదు.

'నేటికిం బదియేనగుదినంబునఁ బౌష్యమాసంబునందు శుక్లపక్షంబునం దష్టమీ రోహిణినాడు.'

ఇదియు పైకారణములంబట్టి యూహించిన వ్యత్యాసము గలదిగనే యున్నది. వ్యవధి తగ్గినదిగాని సిద్ధాంతభాగములకు సరిపడదు.

సంస్కృత భారతమున నీఘట్టమున మాసతిథి నక్షత్ర నిరూపణము లేదు. ఇది నన్నయ కల్పించి చేసినవిశేషములలో నొకటి, కాని జ్యోతిశ్శాస్త్రి

జ్ఞానము చాలక యిట్టియసంగతమును వేసియుండునని యూహింపవలసియుండును. లేనిచో లేఖకాది ప్రమాదంబుల నిట్టిభేదము కలిగియుండవచ్చును. 'పంచమి' మార్చి 'ఏకాదశి' యనిన నిట్టి యసంగతము తీరునుగాన నట్లు సవరణ చేయదగిన దని నిర్ణయింపదగియున్నది.

26 తివ్వను: (ధా. తివియు) తివియను, తివ్వను.

27 అరిగెదరు = అరుగుచున్నవారు.

28 పోవనున్న=పోవలెననియున్న; పోఁగోరియున్న.

29-30-31 ఏనిలో కుంతీదేవియొక్క మర్మవాక్యములెంతేని మెచ్చఁదగి యున్నవి. తమనిజస్థితి బయలు పడకుండను, సామాన్యబ్రాహ్మణు లని దగ్గఱివారు తలంపను అట్టి నిపుణవాక్యములఁ గుంతి పలికెను.

32 మీపంచిన: మీ=మీరు; ప్రథమార్థమందు షష్ఠి. తమయున్న: ప్రథమార్థమందు షష్ఠి. ఇది ప్రాచీన శైలీవిశేషము.

33 పితామహుఁడు - కౌరవపాండవులకు తాత. విచిత్రవీర్యుని మరణానంతరమున వంశోద్ధరణమునకై వ్యాసుఁడు మాతృవాజ్ఞ ననుసరించి యూతని భార్యలందు ధృతరాష్ట్ర పాండురాజులం గనియె.

కుమారకులు=కుమారులు: ఇచ్చట క ప్రత్యయము స్వార్థకము. తమోహరుఁడు=చీఁకటి నణఁచువాఁడు: తేజోవంతుఁడగుటంజేసి తమోహరుఁడయ్యె; అజ్ఞానమును హరించువాఁ డనికూడఁ జెప్పవచ్చును.

హరిమూర్తి=విష్ణుమూర్తి; 'వ్యాసోనారాయణో హరిః' అని యున్నదిగాన వ్యాసులు విష్ణురూపుఁడను ప్రసిద్ధిఁ బొందెను. ఆర్తిహరుఁడు=దుఃఖమును పోఁగొట్టువాఁడు: మహనీయుల మహత్త్వ మట్టిదని లోకవిదితము. పరాశరాత్మజుఁడు: పరాశరునికొడుకు.

34 భట్టారకుడు=ముని.

35 ధర్మసుతుఁడు=యమధర్మరాజు కొడుకు. ధర్ముఁడు=ధర్మము. ఉండువది=ఉండవలసినది: విద్యార్థకము - వినీతాత్ములరై=న్యాయచింతగల వారలై.

36 అపేతదౌర్భాగ్య=పోయిన దౌర్భాగ్యము గలది. హరుఁడు=శివుడు. హరి=విష్ణువు.

37 కృష్ణద్వైపాయనుఁడు: వ్యాసునిపేరు కృష్ణుఁడు; ద్వీపమునబుట్టినవాడుగాన ద్వైపాయనుఁ డనఁబడెను- దాశరాజుయొక్క కూతురు సత్యవతి తండ్రినియోగంబున యమునానదిపైని యోడ నడుపుచుండెను.అచ్చటికి పరాశరుఁడు వచ్చి యాచిన్నదాని మోహించి యానదినడుమ నున్న ద్వీపమున నాచిన్నదానివలన సద్యోగర్భంబున వ్యాసుఁ గనెను. కావున నతనికి కృష్ణద్వైపాయనుఁ డను పేరు కలిగెను. పోవువారు=పోవుచుండిరి: ఇది ప్రాచీన ప్రయోగము.ప్రొద్దు=వేళ: రాత్రివేళను దెలుపుచున్నది.కాని యిప్పటివాడుకలో ప్రొద్దునకు పగటివేళ యని యర్థమున్నది. ప్రొద్దెక్కినది, ప్రొద్దుపోయినది, ప్రొద్దులేదు అనుచో పగటివేళయనియే యర్థము. ప్రొద్దుపొడిచినది యనుచో ప్రొద్దునకు సూర్యుఁ డని యర్థము.

39. కుబేరుఁడు=అష్టదిక్పాలురలో నొకడు. ఇతడు ఉత్తరదిగధిపతి. నవనిధులు కలవాఁడు.అధికధనవంతుఁడు.శివునకు హితుఁడు. పేరిటన్=పేరుతో.

41. అధికశక్తిపురుషులు = శక్తి (గల) పురుషులు-నీవడసిన = నీవు సంపాదించిన. ప్రథమార్థమందు షష్ఠి. భాగీరథి = గంగ, భగీరథుఁడను సూర్యవంశపురాజుచే భూలోకంబునకు తేఁబడినదిగాన భాగీరథి యను పేరు పొందెను.

42. హైమవత = హిమవత్సంబంధమైన; (హిమము = మంచు) హైమశృంగము = మంచుశిఖరము - ఉదధి = సముద్రము (వ్యు-ఉదకమును ధరించునది.) సత్పథ = ఆకాశము (సత్ = నక్షత్రము. నక్షత్రములు బోవు

మార్గము). త్రిభువనములు = స్వర్గమర్త్యపాతాళములు-ఆడవచ్చి = స్నానము చేయవచ్చి, వినోదింపవచ్చి-పార్వతీశమకుట...గంగ=శివునకు గంగభార్య యనియు, నాతడు గంగను జటాజూటంబున ధరించె ననియు ప్రసిద్ధము.

43. గంగాభిషేకార్థము = గంగలో స్నానము చేయుకొఱకు.

45. భార్గవుఁడు = పరశురాముఁడు, భృగునిసంతతివాఁడు. కుంభభవుఁడు = ద్రోణుఁడు-కుంభము, కలశము, ద్రోణము, అర్థభేదము కలవియైనను సమానార్థములుగ ప్రయోగింపఁబడుచున్నవి. అనలము = నిప్పు (అనిలము=వాయువు) - అగ్నిదాహాభీతి = అగ్నిచేఁ గాల్పబడుదు నన్న భయము.

46. మనోవల్లభ = భార్య.

47. దానికి.........కరుణించి: ఇచ్చట షష్ఠి వింతప్రయోగము. దానియెడల నని యర్థము. ఇది యొకప్రాచీనప్రయోగము. అపగతశౌర్యుఁడు=పోయినశౌర్యముకలవాఁడు. బహువ్రీహి.

48. దీనివలన నర్జునునకు ధర్మరాజునందు గలభక్తి తెలియుచున్నది.

50. ఇందు అర్థాంతర న్యాసాలంకారము కన్పట్టుచున్నది.

51. గంధర్వమాయన్ = మాయచేసెన్ (తృ) - గంధర్వుండు పరాజితుఁడయ్యు నర్జునునియెడ ప్రేమయుక్తుఁ డగుట యాతని యౌదార్యబుద్ధిని కనపరచుచున్నది. చాక్షుషి = దివ్యదృష్టినిచ్చువిద్య. విశ్వావసుఁడు=గంధర్వరాజు. దీనంజేసి = దీనిచేత-విశిష్టులు=అధికులు-తాపత్యవంశవర్ధనుండు=తపతియొక్కవంశమునఁబుట్టిన వాఁడు: వంశవృక్షము చూడుఁడు. కామగమనంబులు=కామగమనము కలవి. (బహువ్రీహిసమాసము)

52. గీర్వాణవిభుఁడు=ఇంద్రుఁడు. గీర్వాణులు = దేవతలు (గిర=వేదము, వాణి=వాక్కు. వేదవాక్కులయర్థమును వివేచించువారుగాన దేవతలు గీర్వాణు లనఁబడుదురు. శాపసమర్థంబులగు వాక్కులుగలవారు గనుకను

గీర్వాణు లనఁబడుదురు.)-వజ్రంబు=వజ్రాయుధము. ఇంద్రుని ఆయుధము వజ్రకఠిన = వజ్రాయుధమువలె కఠినమైన.

54. నాకుఁ గూర్తేని = నాయందు నీకు దయగలిగెనేని. ఇదియొక వింతప్రయోగము. కూర్తేని (ధా-కూర్చు=ప్రియపడు - అనలాస్త్రము=ఆగ్నేయాస్త్రము.

56. లోకత్రితయములు = ముల్లోకములు.

57. మేరునగోత్తంసము=మేరు వను పర్వతశ్రేష్ఠము. (ఉత్తంసము=శిఖయందుండు నలంకారము). ధురంధరులు = భారమునువహించువారు, వహించుటకు సమర్థులు-ఇచ్చట భార,ధురశబ్దములు ఏకార్థకములుగాన నత్యుక్తి గానంబడుచున్నది - భరతవంశోత్తములు = భరతునివంశపువారిలో నుత్తములు.

58. అగ్నిపరిగ్రహమును, బ్రాహ్మణసంగ్రహమును రాజధర్మములు.

59. ఇందు అర్థాంతరన్యాసాలంకారము గుర్తింపఁదగినది. ధర్మువు దప్పి - ధర్మువు = ధర్మము, 'దప్పు' యనుపాఠము బాగుగ నుండును.

60. సుర, గరుడ, విహోరగ, యక్ష, గంధర్వులు దేవగణవిశేషములు-రాక్షస పిశాచభూతములు భూతగణములు.

61. వేదాంగములు - ఇవి యారు. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు; నిరుక్తము, జ్యోతిషము, కల్పము. వర్గచతుష్టయము = చతుర్వర్గము - ధర్మార్థకామ మోక్షములు నాలుగు. సదాచారుఁడు = సాధువగునట్టియు పాపరహితమైనట్టియు, ఆచారము కలవాఁడు. పురోహితుఁజేసిన = పురోహితునిఁగాఁజేసిన. ఇందు = ఈలోకమున - పుణ్యపరులు=పుణ్యమందు బుద్ధిగలవారు. ధర్మపరులు, అధర్మపరులు ఇట్టివి—చూవె=సుమా - ఉర్వరాసురుఁడు=బ్రాహ్మణుఁడు (భూదేవుఁడు) - ఆభిజాత్య = పుట్టువుచేగలిగిన.

తాపత్య-తపతివంశమున పుట్టినవాఁడా !

62. ధర్మానిల శక్రాశ్వినులు=యముఁడు, వాయుదేవుఁడు, ఇంద్రుఁడు, అశ్వినీదేవత లిద్దరు. ధర్మరాజు యమునియంశము. భీముఁడు వాయుపుత్రుఁడు. అర్జునుఁడు ఇంద్రునివలనఁ గలిగెను. వీరు మువ్వురును కుంతీపుత్రులు. నకుల సహదేవులు మాద్రీపుత్రులు. వీ రిద్దరును, అశ్వినీదేవతలకు జన్మించిరి. కుంతీ మాద్రులు పాండురాజు భార్యలు. పాండురా జొకనాఁ డరణ్యమున వేటాడుచుండ నొకలేడిమిథునమును జూచి యవి జంతుమాత్రంబులని తలంచి వానిని బాణములచే వధించెను. అవియు ప్రాణావశిష్టులై పడియుండి, వానిలో మొగది 'నేను మునివరుఁడను. నేనును నా భార్యయు మృగరూపమున సుఖమున్నతరిని మమ్మేసితివి; గాన నీకు ప్రియాసంగమంబైన యప్పుడ మరణంబు గలుగునని శపించె. ఆ కారణమున పాండురాజునకు సంతానయోగ్యత తప్పెను. 'అపుత్రస్య గతి ర్నాస్తి' యని యున్నది గావునను సంతానప్రాప్తివలనగాని పితౄణము తీరదు గనుకను నతండు సంతానము వడయఁగోరి తనభార్యయగు కుంతిని బిలిచి ధర్మసంతానంబు గనుమని ప్రతిమాల, నామెయు పరమపతివ్రత గానఁ గామేచ్ఛచేతం గాక భర్త్రాజ్ఞానుసరణమే పరమవ్రత మని నిశ్చయించి తనకు బాల్యమున దూర్వాసుని యనుగ్రహమువలన బడసిన మంత్రసామర్థ్యముచే ధర్మానిలశక్రుల రప్పించి వారివలన ధర్మజ భీమార్జునులం గనెను. తరువాత మాద్రియు సంతానేచ్ఛ బతికిం దెలుప నతని యనుమతంబునను కుంతీదేవి సామర్థ్యంబునను మాద్రి యశ్వినీదేవతలవలన నకుల సహదేవులం గనెను.

63. ఇందు బ్రహ్మచర్య వ్రతమువలన కలుగు దేహపటుత్వమును ఇంద్రియ లోలత్వమువలన గలుగు దౌర్బల్యమును తేటబడుచున్నవి.

64. మహీసురుఁడు=బ్రాహ్మణుఁడు. భూసుర, ఉర్వరాసుర, ఇట్టి పదములే.

69. సమస్తవిదుండు=అన్నియుఁ దెలిసినవాఁడు-ప్రాకట=ప్రసిద్ధిచెందిన-చేకొనువారము=స్వీకరింపఁదగినది. ఇదియొక (వింత) ప్రయోగము.

70. ప్రాద్దు=సేపు - అర్థము = కోరిక, వాడు=దినము-ఉత్తరించి=దాటి.

71. జగత్పూత చరిత్రుడు=జగత్తును పవిత్రముఁ జేయు చరిత్ర గల వాఁడు-దేవలుఁడు=ధౌమ్యుని సోదరుఁడు.

72. స్వస్త్యయనులు=మంగళా చరణము కలవారు-బృహస్పతి=దేవ గురువు. గురుఁడు.

73. యజ్ఞసేనుఁడు = ద్రుపదరాజు.

75. కృష్ణుఁడు=అర్జునుఁడు కృష్ణవర్ణముగలవాఁడు.మాఱెతిఁగిన = మే మెఱిఁగిన. ప్రథమార్థమునందు షష్ఠి.

77. కృష్ణమృగాజినము = లేడిచర్మము - ఉష్ణద్యుతి తేజుఁడు = సూర్యుని తేజస్సువంటి తేజస్సుకలవాఁడు. (ఉష్ణద్యుతి = వేఁడికాంతి కల వాఁడు: సూర్యుడు)—పంకజోద్భవుఁడు = బ్రహ్మ, (పద్మమునందు బుట్టి నవాఁడు. విష్ణుమూర్తియొక్క నాభిలో నొకకమలము పుట్టినది. దానిలో చతుర్ముఖబ్రహ్మ యుదయించెను.) — గతతృష్ణామయుఁడు = పోయిన కోరికయు రోగము కలవాఁడు - ఏకోరికయు రోగమును లేనివాఁడు.

78. కృతాంజలులు = చేయబడిన యంజలికలవారు. దోసిలొగ్గిన వారు. అది వినయసూచకము - సత్యవతీసూనుఁడు = సత్యవతియొక్క కొడుకు, కుంభకారుఁడు=కుండలు చేయువాఁడు, కుమ్మరివాఁడు-పార్థుఁడు= అర్జునుఁడు.(కుంతికి మొదటిపేరు పృథ.పృథయొక్క కుమారుఁడు గాన పార్థుఁ డయ్యె).

79. వైహాయాసము = ఆకాశమందున్నది. విహాయసము = ఆకా శము (వీనియందు, పక్షాదు లన్నియు సంచరించును గాన నీపేరు కలి గెను)— ఏను = అయిదు - తనయ = కుమార్తె (పుం = తనయుఁడు)— తొడిపూసి-తొడి = తొడిగియొక్క రూపాంతరము - కవచము మొదలగు నవి తొడిగి తెల బట్టలను ధరించుకొని, పూసి = గంధము మొదలగు వానిని బూసికొని.

80. పూర్వోత్తరము = ఈశాన్యపు దిక్కు - అగాధోన్నతపరిఘా ప్రాకారంబులు = అగాధములగు పరిఘలు, ఉన్నతములగు ప్రాకారములు. క్రమాలంకారము. తోరణంబులు వెలుపలనుండు ద్వారములు - సానువులు = చరియలు.

81. ధవళ విభూషణము = సొగసైన అలంకారము - పుష్పసాయకుఁడు = మన్మథుఁడు. (పుష్పములు బాణములుగాఁ గలవాఁడు) మన్మథునకు అయిదు పుష్పములు బాణములు. అవి పద్మము, అశోకము, తియ్యమామిడి, క్రొత్తమల్లి, నల్లకలువ; ద్రౌపది మన్మథుని యూరవసాయక మనఁదగినంత సౌందర్యము కలదని యుత్ప్రేక్ష - పుణ్యాహ = మంగళ సూచకములగు-కృతపరిస్తరణుఁడు = చేయబడిన పరిస్తరణము కలవాఁడు. అగ్ని చుట్టును దర్భలు వేసినవాఁడు - అగ్నిముఖము=హోమముకొఱకు అగ్నిని సిద్ధపరుచుట - వేల్చెన్ (ధా. వేల్చు)

82. వాదిత్రము = వాద్యము.

84. అశ్వత్థామ = ద్రోణునికొడుకు - భూరిశ్రవసుఁడు = కురువంశవృద్ధుఁడు-శల్యుఁడు = పాండవుల మేనమామ-జరాసంధుఁడు=రాక్షసుఁడు. కృష్ణునిశత్రువు-యదువృష్ణిభోజాంధకవరులు: వీరు యదువంశములోని తెగలవారు.

85. ఇందు = వీరిలో - ఎవ్వఁడేసెన్ = ఎవ్వఁడేయున్. తద్ధర్మార్థమున భూతకాలరూపము - ఇందువదన=చంద్రుని వంటిముఖము గలది.

86. తివిరి = కోరి(ధా-తివురు) - దివిజులు=దేవతలు-స్వర్గమునఁ బుట్టినవారు - ఖచరులు = ఆకాశమున సంచరించువారు. యక్షులు, గంధర్వులు మొదలగువారు - పణవము = వాద్యవిశేషము. రణితము = మ్రోత; ధ్వని - తూర్యములు = ఊదుసాధనములు - వననిధి = సముద్రము (వనము=ఉదకము)

87. అవిరళ భస్మమధ్యమున నగ్నికణంబులు వోలె బ్రాహ్మణప్రవరులతోన నేర్పడక, ఇందలి యుపమానము బింబప్రతిబింబోపమ. పాండవులు

అగ్నికణములవలె తేజోవంతులనియు వారిచుట్టునున్న బ్రాహ్మణులు భస్మ తుల్యులనియు సూచన. యాదవ వృషభుండు=శ్రీకృష్ణుండు. వృషభశబ్దము శ్రేష్ఠవాచకము. యాదవులలో శ్రేష్ఠుండు - ఇందలి శ్రీకృష్ణుని సంకల్పము ఆమోఘాశీర్వచనంబయి యర్జునుని జయంబునకు సాధనం బైనది.

88 కందర్పబాణ బాధితులయి: కందర్పుఁడు=మన్మథుఁడు. మన్మథుఁడు వేయుబాణములు మోహకారణము లని వర్ణించుట కవిసాంప్రదాయము

89 ఔడు=క్రింది పెదవి.

90 మలపక=చెక్కక. (ధా-మలచు) ప్రమాన్నప్రానుపాటన్= ప్రమాను ప్రమానుపాతముగ.

91 నిర్మదులు=మద ముడిగినవారు - నిజభూర్గమార్గముల్=తమ దేశపు త్రోవలు.

92 నివృత్తులు=మరలినవారు - సజ్యకర్మము = నారిని వింటికి చేర్చి బిగించుట-అచ్చెరువు: ఆశ్చర్యశబ్దభవము.

93 ఇమ్మనుజేంద్రనందను లహీనబలుల్-యిచ్చట 'అమ్మనుజేంద్రనందను లపారబలుల్' అనియుండిన, తరువాతవచ్చు ఇతఁడు అనుదానికి సరిపడిన అర్థసౌష్ఠవము కలుగును. వీర్యమున్నలవారు= వీర్యమున్నలుగలవారు - విప్రవంశమున్నవారు=బ్రాహ్మణ వంశమునందలివారు - ఒప్పరు=పూనుకొనరు.

94 వీరికంటె - ఇచ్చట వారికంటె ననిన బాగుగ నుండును.

95 దీర్ఘబాహు పరిఘుండు=పొడవైన గడియప్రమానువంటి బాహువులు కలవాఁడు - తేజస్వి=తేజస్సుకలవాఁడు - పొంఁదెడుమంచున్=పొందెడున్+ అంచున్.

96 గురువులను=పెద్దలను.

97 ఫలపవనాంబు భోజన శుభవ్రతవృత్తులు - బ్రాహ్మణుల యాచారములు, నియమములు వ్రతములు మొదలగువానివలన కలుగు లాభము లిందు

స్పష్టమగుచున్నవి - భవ్యులు=యోగ్యులు - చరాచరాఖిలజగంబులు=చలించు నట్టియు చలింపనట్టియు లోకంబులు.

99. జలధరమార్గము = ఆకాశము, జలధరము = మేఘము. ఒక్క డయి = ఒక్కటియై. 'ఒక్కడు' ఆధునికపద్ధతిని మహాద్వాచకము.

100. భూలోకమున మహాత్కార్యములు జరుగునప్పుడు సురులు దుందుభుల మ్రోగింతురనియు పుష్పవృష్టి కురియుననియు కవిసాంప్రదాయములు - నరుఁడు = అర్జునుఁడు. ఇతడు పూర్వజన్మంబున నరుడనుమునియై నారాయణునితోఁ కలిసి తపంబొనరించెను. ఆనారాయణుఁడే శ్రీకృష్ణమూర్తి కావున నీజన్మంబున శ్రీకృష్ణుండును నర్జుండును అత్యంత మైత్రితో కలసి యుండిరి.

101. నకులసహదేవానుగమ్యమానుండయి = నకులసహదేవులచేత కూడరాబడినవాఁడై అనగా నకులసహదేవులు కూడరాన్.

102. తోయజదళనేత్ర = స్త్రీ; బహువ్రీహిసమాసము. (తోయ = నీరు, తోయజము = పద్మము.) సురరాజు = ఇంద్రుఁడు-అసితరత్నము= నీలమాణిక్యము. అంగజుఁడు = మన్మథుఁడు-ధనంజయుఁడు = అర్జునుఁడు ధర్మరాజుచేసిన రాజసూయమునకై, రాజుల జయించి, అనంతధనముఁ దెచ్చిన కారణమున, ధనంజయుఁడను ప్రఖ్యాతి కలిగెను. కౌరవేంద్రుఁడు=దుర్యోధనుఁడు, ఇచ్చట ఇంద్రశబ్దమునకు రాజని యర్థము.

103. రాన్ (ధా. వచ్చు) - శఠుండు = కుత్సితుఁడు, దుర్మార్గుఁడు, నిర్గతసత్త్వుఁడు = పోయినసత్త్వము కలవాఁడు; సత్వముపోయినవాఁడు.

104. నృపతులు - నృ = నర - నృపుడు = నరపతి.

105. ఏమి = ఏ. ప్రశ్నార్థకముకాదు-వధ్యుఁడు = శిక్షకుతగిన వాఁడు-అవిప్రుతోడిదేమి = అవిప్రునితోమనకేమి - భీతుండు = భయపడినవాఁడు-ఇందు బ్రాహ్మణులు ద్రుపదునకు శరణంబిచ్చిన విధంబును వ్రాయ

శత్రువులను వారింపఁజేసిన ప్రయత్నములును మిగుల హాస్యాస్పదముగ నున్నవి.

105. కడిఁది=కఠినులగు-విషాహులు=విషముగల సర్పములు-మదీయాస్త్రము లనియెడు పటుమంత్రముల ............ కడిఁదివిషాహుల దర్పంబుడిగించెద. ఇంచలి రూపకాలంకారము గుర్తింపఁదగినది. పాములవాఁడు తనమంత్రబలముచే పాములనణచునట్లు అస్త్రములచేత శత్రువుల నిర్జించెదనెను. బ్రాహ్మణుఁడు గానతనమంత్ర సామర్థ్యముచేత శత్రువుల నుక్కడగించెద నని స్ఫుటార్థము.

107 దండధరుఁడు=యముఁడు. యముని యాయుధము దండము. బలదేవుఁడు=కృష్ణుని యన్న.

108. తాలాభము=తాటిచెట్టువలె ప్రకాశించునది - మహావృక్షహస్తుఁడు: బహువ్రీహి. భీముఁడు మిగుల బలశాలిగాన నతనికి నుత్సాహముకలుగునపుఁడు గొప్పమ్రాను పెరికి దానితో శత్రువుల నుక్కాడువాఁడు. వృకోదరుఁడు=భీముఁడు. (వృకము=తోడేలు, తోడేలు కడుపువంటి కడుపు కలిగినవాఁడు.) అప్పుడువోయిన - ఇచ్చట వకారాగమమువింత ప్రయోగము. హాలధరుఁడు=బలరాముఁడు, హలము=నాగలి, బలరామునకు నాగలి యాయుధము.

109. ధరణీదేవుఁడు = బ్రాహ్మణుఁడు - దివిజులు = దేవతలు. దివి = స్వర్గము. స్వర్గమునఁ బుట్టినవారు దేవతలు.

110. అంభోభృత్పథము = ఆకాశము - అంభస్=ఉదకము. అంభోభృత్ = మేఘము. ఉదకమును ధరించునది. అంభోభృత్పథము=మేఘములు పోవుమార్గము.

ఆస్తీర్ణము=పరవఁబడినది - ఆస్తీర్ణంబయ్యె ధరిత్రియెల్లన్=భూమియంతటను బాణములు పరచిన ట్లయ్యెను - దిక్చక్రము = దిక్కులన్నియు కలిసి చక్రాకారమగునని తెలియుచున్నది

111. నేరక (ధా-నేర్చు) - ఆవలులు = సముదాయములు (రూ-ఆవళులు - లళలకు అభేదముకాన నట్లుమార్చుట కలదు - ఏటు = బాణములు వేయుట (ధా-ఏయు) రాధేయుఁడు = కర్ణుఁడు. కర్ణునిపెంచినతల్లి రాధ.

112. భార్గవుఁడు = పరశురాముఁడు. భృగువంశీయుఁడు - కౌంతేయుఁడు = కుంతీపుత్రుఁడు.

113. అప్రాకృత = ప్రకృతిలోలేని, ప్రకృతికిమించిన. దేవసంబంధమైన - పార్థుండు = అర్జునుఁడు. పృథయొక్క కొడుకుగాన పార్థుఁడు. కుంతికి మొదటిపేరు పృథ. ఈమె యదువంశపురాజగు శూరసేనుని పెద్ద కూతురు. వసుదేవునిచెలియలు. శ్రీకృష్ణునకు మేనత్త. శూరసేనుని మేనత్త కొడుకగు కుంతిభోజుఁడు సంతానము లేనివాఁ డగుటంజేసి కుంతిని యాతని కిచ్చెను. కావున నామెకు కుంతి యను పేరుకలిగెను.

114. కానీన = కర్ణుడా. కుంతీదేవి కన్యకగనుండ సూర్యునివరముచేఁ బుట్టినవాఁడుగాన కానీనుఁ డనబడెను. ఇచ్చట నర్జునుండు కానీన యనిపిలుచుట యసంగతము. అప్పటికి కర్ణునిజన్మ వృత్తాంతమెవరికినిఁ దెలియదు— నిన్నుఁ బోరిలో నోర్వఁగానున్న పీరుండ = ఇది భావిసూచకము-ఒండు దక్క = ఇతరమాటలు మాని-లోగక = వెనుదీయక.

115. ఈపద్యమువలన కర్ణునకుఁగల బ్రాహ్మణభక్తి తెలియుచున్నది-అట్లు సకలరాజులోకంబెల్లఁ బార్థుచేభంగపడి: తక్కినవారెవ్వరును యుద్ధముచేయకున్నను వారియందఱిలో బలవంతుఁడగు కర్ణుఁడోడుటచేత వారును నిరాశజెంది భయపడి పలాయనమైరి. కాన వారును భంగపడినట్లు వర్ణింపంబడెను. మల్లయుద్ధము = కుస్తీపట్లచే జగడమాడుట.

116. శల్లుడు = శల్యుఁడు (తద్భవము) తరువాతవచ్చు 'ప్రదెల్లు' పదములో ప్రాసయతికి సరిపోవుట కిట్టి తద్భవసృష్టి చేయబడెను.నన్నయ భట్టు వాగనుశాసనుఁ డను బిరుదున కిదియొక దృష్టాంతము.

117. హరుఁడు = శివుఁడు. హరి = విష్ణువు.

118-119. దుర్యోధనాదుల దుష్ప్రయత్నమును శ్రీకృష్ణులు వారి ప్రయత్నముల వారించిన నైపుణ్యమును గుర్తింపదగినవి-చన్నె = చనువా.

120. వలపదు = వలదు; వద్దు.

121. పెద్దప్రొద్దు = చాలసేపు-విసువక = విసుగక.

122. కవలవారు = నకులసహదేవులు - భువనత్రయము = త్రిభువనములు-అధర్మభీత = అధర్మమగు వాక్కు వచించితినన్న భయముపొందినది.

123. నాయుక్తి ద్రోల్లి యనృతమెన్నండుగాదు. ఇందు అధర్మభీతియు అసత్యభీతియు పెనగొనుచుండినట్లు కనబడుచున్నది, జిష్ణుఁడు= జయస్వభావముగలవాఁడు. ఇతనికెక్కడను జయముగాని అపజయములేదు. కావున నితనికీ ప్రఖ్యాతనామము కలిగెను.

124. అగ్రమహిషి = రాజుయొక్క ప్రథమభార్య - విధిప్రేరణము = దైవముప్రేరేపించుట.

125. పాండుభూపాల తనూజపంచకము = సంఖ్యోత్తరపద సమాసము-పంచశరాహతి = మన్మథునియొక్క దెబ్బ - చెయ్వు = చేత-ఆలరి = అడ్డులేని, అమోఘమయిన, పరమార్థము = ఉత్తమధర్మము.

126. తమయేవురయభిప్రాయంబెఱింగి-దీనివలన ధర్మరాజుయొక్క పరేంగిత జ్ఞానము తెలియుచున్నది.

127. ఈపద్యమువలన ధర్మరాజు చేసిన నిశ్చయమునకు కారణములు తెలియుచున్నవి. వ్యాసులు లోగడచెప్పియున్న ద్రౌపదీవృత్తాంతమును తమ యంతఱకును ద్రౌపదియందు నొక్కమారు మోహముకలుగుటయు తమ తల్లివచన మన్యథా జరగవలదన్న పూనికయు అట్టినిశ్చయమునకు కారణములయినవి-గురువచనమనుచో వ్యాసులు, తల్లి యిద్దఱివచనములును ద్యోత్యములగుచున్నవి.

129. రాముండు=బలరాముఁడు. రాములు ముగ్గురు. పరశురాముఁడు, శ్రీరాముఁడు, బలరాముఁడు. ముగ్గురును విష్ణుని యవతారములలో గణింపఁ

బడుదురు. కాని బలరాముఁడు శేషాంశసంభూతుఁడును శ్రీకృష్ణుఁడు విష్ణు అంశ సంభూతుఁడును కాన నతఁడు విష్ణునియవతారమనఁజనదు. కాని కృష్ణుఁడు చిన్నవాఁడగుటంజేసి కాబోలు బలరాముఁడు అవతారపురుషుఁడుగ గణింపంబడెను. అజామీఢుఁడు = అజామీఢునిసంతతివాఁడు. వంశవృక్షమునుచూడుము - అజాతశత్రుఁడు = ధర్మరాజు. ఇది యతని ప్రఖ్యాతనామము. ఇతనికి నెవ్వనియందును శత్రుత్వబుద్ధి లేదుగాన నట్టి ఖ్యాతి కలిగెను. తమ మేనయత్తకొడుకున్:—బలరామకృష్ణులకు కుంతి మేనత్త. ఈవృత్తాంతము 113వపద్యమువ్యాఖ్యలో నున్నది. చూడుడు.

130. ఈపద్యమువలన వారివారి వయోభేదములును అట్టిభేదముల ననుసరించి యన్యోన్యము చేయదగిన సత్కారంబులును తేటఁబడుచున్నవి. పరమసమ్మదరస:—సంతోషము దయ మొదలగు గుణములను రసములని వర్ణించుట కవిసాంప్రదాయము. ఇట్టి గుణములవలన మధురరసాస్వాదనముచేఁ గలుగు సంతోషాదులు కలుగును గాన నట్టియుపమానము సుప్రసిద్ధమైనది. వారికుశలం బడిగి=బంధుసమావేశమున జరపఁదగినప్రథమవిధి.

132. ఒవ్వమి = సరిపడకుండుట, తమనిజరూపున మెసలుట క్షేమముకాదని యభిప్రాయము.

133. ఈపద్యమునందలి యుపమాన మెంతేని రమ్యంబై యున్నది. దీనివలన పాండవుల మహిమయు వారియెడల శ్రీకృష్ణునకుఁగల గౌరవాభిప్రాయమును వెల్లడి యగుచున్నవి. అంబుజమిత్రుఁడు=సూర్యుఁడు, అంబుజము = పద్మము.సూర్యోదయమైనతోడ నేపద్మములు వికసించునుగాన నతని కిట్టిపేరు కలిగెను. అంబుదము = మేఘము-నీటినిచ్చునది. (ద=ఇచ్చుట).

134. అతిమానుషము = మనుష్యశక్తికి మించినది. అర్జునునకుఁగాక- అర్జునునకుతప్ప 'కాక' ఇదియొక ప్రాచీనప్రయోగము.

135. ముదుసలి = ముసలి - సాని = అధిపురాలు. ఈమాట కిప్పుడు అపార్థమందు ప్రయోగము గలదు. అయినను దొరసానియను నప్పు డపార్థ

ము లేదు-అక్కన్యను క్రమొక్కించి=కన్యకచేతనని యర్థము. ద్రౌపదినంతఁ బిలిచి: వివాహమైనకాకుండ కోడలగునని పనులనియమించుట అత్తగారితనము యొక్క ప్రాబల్యము స్పష్ట మగుచున్నది-బలివిధానములకు, బ్రాహ్మణాతిథులకు,అన్నకాంక్షులైన యతిథులకు; ఇట్టి సదాచారములు హిందూమత ధర్మములలోనివి. ఇవి వేదవిహితము లగు నాచారములు. ఇట్టియాచార సంపన్నులగుట వా రుత్తమ వర్ణములవా రని యెఱుంగుటకు హేతువులలో నొకటి.

136. భీముని బలమును జఠరపుష్టియు దీనివలనఁ దెలియుచున్నవి. అయుతము = పదివేలసంఖ్య. నాగము = ఏనుఁగు (వ్యు - నగము = కొండ నగమున బుట్టినది గాన నాగము). నాగాయుత బలుఁడు = పదివేలయేనుఁగుల బలము కలవాఁడు. వాయుదేవుఁడు మహాబలశాలి గావున నతనికి జన్మించిన భీముఁడును నట్టివాఁడయ్యె - అబల= స్త్రీ).

137. అవ్వ=ముసలిది. ప్రాచీనప్రయోగముల పడుచు లనిగూడ నర్థము గలదు. దమయంతిని గూర్చి బ్రాహ్మణుఁడు 'అవ్వ నీతల్లిదండ్రుల కాత్మజులకు' అనుచో ముసలిది యని యర్థముగాదు. గౌరవార్థకమని యెఱుంగ నగును - రూపు=విధము, ఉపధానభూతి = దిండుమైనది. ఉపధానమనఁ దలగడ. ఇచ్చట పాదములకొద్ద నుండుటచేత దిండని గ్రహింపనగును.

138. ఆదిగర్భేశ్వరి=గర్భాదినుండి యైశ్వర్యముకలది.ఆగర్భశ్రీమంతురాలు, నిస్సంశయముగ ద్రౌపదికి వారియెడల నప్పుడు పూర్ణసమ్మోదము గలుగుటకు జన్మాంతరానుబంధమును దైవప్రేరణమును కారణము లని యూహింపవలసి యున్నది.

136. కడవసములు=తోళ్లు. ఇక్కడ కృష్ణాజినములు - కోలలు=దండములు-బ్రహ్మచారులు గాన దండములు కలవారు - కప్పడములు = చినిగిన బట్టలు - దేశికులు = బ్రాహ్మణులు - మడవక=విముఖురాలుగాక - (ధా- మడపు) నిండుమనమునన్=నిస్సంశయమగు ప్రేమతో. ఈపద్యమున వర్ణింపఁబడినవి వారి బాహ్యవ్యాపారములు.

140 ఈపద్యమున వారి వచోధోరణిం బట్టి తెలిసికొనఁదగిన విషయము లున్నవి. పినివలన నత్యుత్తమక్షత్రియులని వ్యక్తమగుచున్నది - ఎఱుగరాదు = తెలిసికొనుటకు శక్యముకాదు. రాదు (ధా-వచ్చు) ఇచ్చట విశేషార్థము.

141. ఎఱుంగవేఁడి - వేఁడి = కోరి- భీముచేతఁ బూజితుఁడయి-ఇది సదాచారమునకు నిదర్శనము - ధర్మరాజు భీమునిచే నట్లు చేయించుటయు రాజధర్మము.

142. ఏకునన్ = ధైర్యముతో - ఉన్నతితో,

144 నెవ్వగన్ = నెర+వగ=నిండు ఆలోచనతో

145 - 146 ఈపద్యములోని ధర్మరాజు వాక్యములు మిగులనైపుణ్యసూచకములయి యున్నవి-అకృతాస్త్రుఁడు=అస్త్రవిద్య నేరనివాఁడు

147. మీరాజు మనోరథంబు సఫలంబయ్యె-ఈవచనమున యథార్థసూచనమున్నను ఎవ్వరికిని నదితేటఁబడలేదు. ఇందు శ్లేష కనఁబడుచున్నది. మత్స్యయంత్రమును కొట్టినవాఁడు ద్రౌపదికి భర్త కావలెనను కోరిక తీరినదిగాన ద్రుపదుని కోరిక తీరిన దనునది బాహ్యార్థము. ద్రుపదుఁడెట్టి కోరికతో ద్రౌపదిని బడసెనో, ఆకోరిక తీరెననునది అంతరార్థము. ఈయర్థమెవరికిని స్ఫురింపలేదు. స్ఫురించుటకు నవకాశమును లేదు. ద్రుపదుఁడు తన సందేహనివృత్తికొరకు చేసిన ప్రయత్నములు మిగుల నైపుణ్యమును తెలుపుచున్నవి. పరార్థ్యంబులు=ఇతరులు కోరఁదగినవి. సాంగ్రామికంబులు = యుద్ధసంబంధములైనవి, సంగ్రామము=యుద్ధము

148. ఇందు వర్ణింపఁబడిన వన్నియును మహాపురుషలక్షణములు.

150. ఏ నగ్రజుండ=తనపేరు చెప్పక ఇట్లు తనను గురించి తెలుపుట శిష్టసాంప్రదాయము-యములు=యమళులు; కవలు-అరిందములు-శత్రుసంహారకరులు.

151. కుంతీమహాదేవులు=ఇచ్చట బహువచనము గౌరవార్థకము. హర్ష రసావేశ పరవశుఁడు=సంతోషము మెండగుటచేత మైమఱచినవాఁడు.

152. అభిజనము=స్తోత్రము - విచిత్రవీర్యపౌత్రుఁడు=విచిత్రవీర్యుని మనుమఁడు - పుత్రుని పుత్రుడు, వంశవృక్షముఁ జూడుఁడు.

153. ధర్మవిధిన్=శాస్త్రము విధించినరీతిని - పాణిగ్రహణము=వివాహము-కన్యయొక్క పాణిని వరుఁడు గ్రహించుట ఇది వివాహమునకు ముఖ్యాంగము. సోదరులలో పెద్దవానికి వివాహముకాకుండ చిన్నవాఁడు వివాహం బాడకూడ దను ధర్మము సుప్రసిద్ధము. ఇట్టి ధర్మమును అతిక్రమించిన పరివేత్తృత్వ దోషము కలుగును అని ధర్మశాస్త్రజ్ఞు లందురు.

154. అభిమతముగన్ = సమ్మతముగన్.

155. ఈపద్యము పాండవుల మాతృభక్తినిఁ దెలుపు చున్నది. 'మాతృదేవోభవ' యనుమాటను జరుపుటలో పాండవులదీక్ష కొనియాడఁదగినది. ఆచారమునకును శాస్త్రమునకును లోకవ్యవహారమునకును విరోధముగ నున్నను మాతృవాక్యపరిపాలనమునఁ బాండవులకుఁ గల దీక్ష కనబడుచున్నది.

156. వినియు నెఱుఁగము = చూడలేదు సరేగదా విననైనలేదని నిశ్చయార్థకము.

157. ద్రుపదునకు ధర్మరాజుమాటయందు గల విశ్వాసమును అతఁడు ధర్మపరుఁడన్న లోకఖ్యాతియు స్పష్ట మగుచున్నవి. అశ్రుతపూర్వము = పూర్వ మెప్పుడును వినబడనిది.

158. తా = అది. ఇది అత్యుక్తి - పుట్టన్ = చేయుటకు—పరాశర సూనుఁడు. పరాశరునికుమారుఁడు.

159. అర్ఘ్యపాద్యాదివిధులు - అర్ఘ్యము = చేతులుకడిగికొనుటకు నుదకము. పాద్యము = కాళ్లుకడిగికొనుటకు నీళ్లు. విధులు=విధివంతముగ చేయువలసిన పనులు - హితమధురసత్యసంభాషణంబులు = వినువారికి

హితవుగను మాధుర్యముగను ఉండి సత్యములగుమాటలు. అట్టివి ఉత్తముల సంభాషణలక్షణములు. ముకుళితకరకమలుండు = జోడింపఁబడిన హస్తపద్మములు కలవాఁడు - చేతులను పాదములను పద్మములతో సరిపోల్చుట కవిసంప్రదాయము. కరములు ముకుళించుట వినయచిహ్నము.

160. ఈపద్యమువలన ద్రుపదునకు ధర్మరాజుమాటయందుగల విశ్వాసమును ధర్మరాజు ధర్మపరుఁడను లోకవిఖ్యాతియు వెల్లడియగుచున్నవి; తనుమధ్య = స్త్రీ-సూక్ష్మమగు నడుముకలది.

161. మహాత్ముల్ ధీరమతు లిట్లుచేసినవారు గలరె: సదాచారమునకు మహాత్ములును ధీరమతులును చేయుపనులు ప్రమాణము లని యెఱుంగునది- ఆప్తవచనానుమతిన్: ఏపనిచేసినను ఆప్తులయంగీకార మవసర మనియును వార లొప్పనిపని చేయదగదనియుఁ దెలియుచున్నది.

162. విమలమతిన్ = నిర్మలమగుబుద్ధితో-విషయము = గోచరము. తెలియఁబడునది- ధర్మసంకరము = ధర్మముచెడిపోవుట.

164. వచనంబున ధర్మమునందు = వచనంబున్+అధర్మమునందు- హాస్యమునకైనను బొంకన్నది యెఱుగఁడని తేటపడుచున్నది. ధర్మవవశ్యము నట్లు = ధర్మముకూడ నావచనమునకును చిత్తమునకును సరిపడియే యుండును. 'సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః' అను శాకుంతలలోని దుష్యంతవాక్యమును ఇట్టి నిశ్చయమునే తేటపరచుచున్నది. సత్పురుషులయొక్క అంతఃకరణప్రవృత్తియే ధర్మాధర్మనిరూపణమునకు ప్రమాణము. శకుంతలవిషయమై దుష్యంతుని యంతఃకరణప్రవృత్తి యెట్లు ప్రమాణమయినదో, అటులనేధర్మస్వరూపుఁడగు ధర్మరాజుయొక్క మనోదార్ఢ్యమే ధర్మమునకు ప్రమాణ మని తలఁపనైయున్నది. పక్కి = మాని; విడిచి.

166. గురులు = గురువులు - అన్యథాకరింపగన్ = తప్పుటకు. అంచో యకు = అంపఁఁబడు. యతిభంగమునకు నీరూపము నిచ్చట ప్రయోగించెను.

167. ధర్మసూక్ష్మత = సూక్ష్మమగుధర్మము. త్రికాలప్రవర్తన జ్ఞాని - అతీంద్రియజ్ఞానము మునులకు తపస్సువలనఁ గలుగును.

168. దేవి = రాజుప్రథమభార్య-మాధవి = కుంతి. మధువువంశమున బుట్టినది గాన మాధవి - ఈమధువు యదువంశపురాజు. కార్తవీర్యార్జునుని కొడుకులలో నొకఁడు. కుంతి యితనివంశమునఁ బుట్టినది. కావున మాధవి య య్యె. ఇటులనే శ్రీకృష్ణుఁడు మాధవుఁడయ్యె - ఒక్కండ = ఒక్కటియే ఒండుదక్క =ఇతరాలోచనలు మాని - చేయూది = చేయిపట్టుకొని - ఇష్ట మైని =ఇష్టమయిన.

169. పంచేంద్రోపాఖ్యానము = అయిదుగు రింద్రులను గురించినకథ. ఆఖ్యానము = చెప్పఁబడినది. ఉపాఖ్యానము = పెద్దకథలో సందర్భాను సారముగఁ జెప్పబడినవేఱుకథ. నాలాయని = నలునికూతురు. నలుఁడు సూర్యవంశపురాజు. ఇతనికి నింద్రసేన యనుకూతు రుండినట్లు నలచరిత్రమున నున్నది. ఆచిన్నదియే జన్మాంతరమున ద్రౌపది యయ్యెనని కనఁబడుచున్నది

169. 170. పతివ్రతలధర్మము లిందు తెలుపఁబడుచున్నవి.

171. పంచధావిభక్తుండ వయి = అయిదు వేరురూపముల ధరించి. ఇట్టి విలక్షణమగులోకిరయే పూర్వవాసనాశేషమయి ద్రౌపది కీజన్మంబున నేగురుభర్తలగుటకుఁ గారణమైనది—తపస్సువలన కలుగు సామర్థ్యంబులిందు కన్పట్టుచున్నవి. తపస్సునకు నసాధ్యమగునవి యొవ్వియు లే వనునదిహిందూ మతసిద్ధాంతములలో నొకటి. స్వేచ్ఛావిహారము సర్వపీడానివారణము కామ గమనము కామరూపము ఇచ్ఛాపరిపూర్తి మొదలగునవి యన్నియుం తపస్సు వలన సాధింప నగునని కన్పట్టుచున్నవి—ఆప్లుతుండు = స్నానముచేసిన వాఁడు-శీతాంశుఁడు=చంద్రుఁడు-చల్లనికిరణములు కాంతి కలవాఁడు-కైలా

నము = వెండికొండ-హిమవంతమున కుత్తరమున నున్నది. ఇది కుబేరుని స్థానము. దీనిశిఖరమున శివుడుండును. కేళీసముదాయము దీనియందుజరుగును గాన దీనికి కైలాసమను పేరు కలిగెను. (కేలం = కేళీసముదాయము). కుబేరుఁడు మొదలగు గంధర్వులు దీనియందు కేళి సలుపుదురు. దీనిశిఖరమున శివుడు నాట్యముచేయును - మేరువు = మేరుపర్వతము. బంగారుకొండ - పెద్దకాలంబు = చాలకాలము - పశుపతి = శివుఁడు (పశు = ప్రమథగణములు).

172. ఆత్మదేహాంశజులు = తమదేహములవలనఁ బుట్టినవారు. ఇది యింద్రసేనయొక్క ద్వితీయజన్మవృత్తాంతము.

173. జలానిలాహారిణి = జల+అనిల+ఆహారిణి నీరు గాలి ఆహారముగాఁ గలది. తపస్సునకు ఆహారనియమము ముఖ్యమైనది. తపోమార్గము లీపద్యమునఁ దెలియుచున్నవి-అర్థిత్వంబున = ఇచ్ఛాప్రాబల్యముచేత- ఆతురతచేత అట్టివచోధోరణియు పూర్వజన్మవాసనా ప్రేరితమును ఉత్తరజన్మయందలి కార్యములకు కారణమును అగుచున్నది. ఇటులనే జన్మాంతరవాసనలు జీవుల నాశ్రయించి వారిని పగ్గములవలె పట్టి నడుపుచుండును.

174. ఒక్కరుండ= ఒక్కఁడే - లోకవిరుద్ధంపు = లోకాచారమునకు విరుద్ధమైన-

175. రుద్రుండు = శివుఁడు. (దుఃఖమును పోగొట్టు వాడు. శత్రువుల దుఃఖపెట్టువాడు)

176. ఇందీవరము = నల్లకలువ. ఈశ్వరప్రసాదమున ద్రౌపదికి పంచపతిత్వము నిర్దిష్టమైనది.

177. అట్లేని = అట్లయితే - పంచిన=(ధా-పంపు)

178. దక్షాధ్వరమథనుఁడు = శివుఁడు - దక్షునియజ్ఞమును పాడుచేసినవాఁడు-పద్మేక్షణ = పద్మ+ఈక్షణ ఈక్షణము = దృష్టి; కన్ను-

సహస్రచక్షుఁడు = వేయికన్నులుగలవాఁడు. ఇంద్రుడు. సురనది = గంగ. దేవలోకమున గంగకు మందాకిని యనిపేరు.

179. వైవస్వతుఁడు = యముఁడు. వివస్వతుఁడు = సూర్యుఁడు సూర్యుని కుమారుఁడుగాన యముఁడు-నైమిశారణ్యము = ఇది హిమవత్ప్రాంతమున నున్నది - సత్రయాగము = ఒకవిధమగుయాగము-ప్రాణి = ప్రాణము గలది-మర్త్యులు= మనుష్యులు మృత్యువు గలవారు. అమర్త్యులు = దేవతలు, మృత్యువులేనివారు-అమరజ్యేష్ఠుండు = బ్రహ్మ. దేవతలలోఁ బెద్దవాడు.

180. ఇంతకు = ఈపాటికి - కృతకార్యుఁడు = చేయబడినకార్యము కలవాఁడు. తనుప్రారంభించిన కార్యముపూర్తియయినవాడు-అంతకుఁడు = యముఁడు. అంతము నొనరించువాడు.

181. సూర్యమితతేజులు = సూర్యునితోసమానమగు తేజస్సుకలవారు. ఆతనికావించు = ఆతడుచేయు- కావించు(ధా-అగు)

182. అమరపతి = ఇంద్రుఁడు దేవతలకుపతి-అమరులు = దేవతలు-మరణములేనివారు. పురోగములు = ముం దిడుకొని నడచువారు-ఆపగా = నది. (వ్యు. ఉదకసమూహము దీనియందు పోవును.)

183. నాదు = నాయొక్క-వాసవుఁడు = ఇంద్రుఁడు, రత్నములు కలవాఁడు.

184. అచలము = కొండ-చలనములేనిది-ఆదిదేవుఁడు=శివుఁడు-కాన్ = అగునని-వగచి = తలచి.

185. స్థావరములు = కదలని వృక్షాదులు - జంగమములు = చలించు పశుపక్షిమృగాదులు-మమతాగోచరము = నాకధీనమైనది. అస్మద్బాహువజ్రానుపాల్యములు = నాయొక్క బాహువులచేతను వజ్రాయుధముచేతను పాలింపఁబడుచున్నవి-ఉలుక = లక్ష్యపెట్టుక.

187. ప్రకాశంబుగన్ = వెల్లడియగునట్లుగా-విగుర్వింపుము = చక్కగావిరువుము-గోత్రభిదుఁడు=ఇంద్రుఁడు. కొండలనునరికినవాఁడు. పూర్వమున కొండలకు ఱెక్కలుండి వానివలన లోకమునకు పీడ కలుగుచుండ ప్రజాసంరక్షణార్థము ఇంద్రుఁడు వజ్రాయుధముచే వానిఱెక్కలనునరికెను. కాన నతని కీపేరు కలిగెను.

188. గిరిరాజము = గిరిశ్రేష్ఠము-రాజశబ్దము శ్రేష్ఠవాచకము-దినేశ= దిన+ఈశ = సూర్యునియొక్క-తీర్చి = విడదీసి-ఏర్పరచి - మయూఖము = కిరణము;కాంతి - గీర్వాణులు = దేవతలు-హితముపొంటె = హితముకొఱకు-ఇంద్రుఁడు కొండశిఖరమును విడ దీయగా నందుకనబడిన నలుగురును ఇంద్రులు. వారునలువురును పూర్వమున నింద్రాధిపత్యమును వహించినవారు కావచ్చును.

189. కమలభవుఁడు=కమలమునఁబుట్టినవాడు-బ్రహ్మ.ఇతఁడుచతుర్ముఖబ్రహ్మ-సితాసితకేశద్వయంబు=తెల్లనిదియు నల్లనిదియు నగు రెండువెంట్రుకలు-శ్రీమన్నారాయణుని కేశములు రెంటును శ్రీకృష్ణబలరాములయ్యె నని పురాణవిదితము. వాసుదేవుఁడు=శ్రీకృష్ణుఁడు, వసుదేవునికొడుకు. శ్రీమూర్తి= శోభాయుక్తమగు రూపము కలది-యాజ్ఞసేని = యజ్ఞసేనుని కూతురు-ద్రౌపది-ద్రుపదునకు మొదటిపేరు యజ్ఞసేనుఁడు.

190. ఇన = సూర్యుఁడు. పావక = అగ్ని. పవిత్రముచేయువాఁడు కాన నగ్నికి పావకుఁడను పేరు కలిగెను. ఇనపావక వర్ణములన్ = సూర్యుని వంటియు అగ్నివంటియు చాయలు కలిగి - కేయూరము = బాహువులన ధరించు నలంకారము.

192. నైతంతువులు = నితంతుని కొమాళ్లు.

193. దైవాధిష్ఠితంబు=దైవముచేత నిర్ణయింపఁ బడినది.

194. శశాంకుఁడు = చంద్రుఁడు. శశము = చెవులపిల్లి-చంద్రబింబమునఁ జెవుల పిల్లియాకారముగల మచ్చ యున్నది. కాన చంద్రునకు శశాం

డు డను పేరు కలిగెను. (శశ+అంతుఁడు; చెవులపిల్లి చిహ్నముగ గలవాఁడు) వివాహముహూర్తముకూడ రోహిణీ నాడనియున్నది. కనుక స్వయంవరము నకును వివాహమునకును యిరువదియేడు దినములు వ్యవధి యున్నదని గ్రహింప నై యున్నది.

195. సమారబ్ధ వివాహోత్సవుండు = ఆరంభింపఁబడిన వివాహోత్సవము కలవాఁడు — క్రముక = పోకచెట్టు. నవాశ్వత్థ పల్లవ మాలాలంకృత: దీనివలన రావిచిగుళ్ల తోరణములు కట్టునాచారము కనఁబడుచున్నది. ఇప్పుడు మామిడాకుల తోరణములు గట్టుచున్నారు. - చందనోదక సంసిక్తము: మనకాలమున గోమయోదకముచేత తడుపునట్లు చందనోదకముచేఁ దడుపువారని కనఁబడుచున్నది. ఇది యతిశయోక్తిగ నెంచదగి యున్నది—ప్రాంగణము=వాకిలి—రంగవల్లి = ముగ్గు; కర్పూరముతోను, మంచిముత్యములతోను ముగ్గులు పెట్టిరనుట యతిశయోక్తి కావచ్చును. పరిమళార్థము కర్పూరముకలిపి మంచిముత్యములవలె నుండు తెల్లనిపిండిచేత ముగ్గులు పెట్టిరని యూహింపనగును. పూర్వోత్తర దిగ్భాగంబున=ఈశాన్యదిక్కున - నేత్రవిరచిత = పనివాండ్రచే రచింపఁబడిన — వితానము = మేలుకట్టు - సొగసుగఁ గట్టఁబడినది. (చాందిని)—సమీచీన=పరిశుద్ధమైన - చీనాంశుకము - బంగారు బట్ట - జల్తారువేసెనబట్ట - స్తంభములకు రంగుబట్టలును జల్తారుబట్టలును కట్టునాచార మానాడుకూడ నుండినట్లు కనఁబడుచున్నది-ప్రత్యగ్రపల్లవ......శోభితంబును = ఎదుటను చిగుళ్లతోను అక్షతలతోను అలంకరింపఁబడిన పూర్ణకలశములచే శోభస్కరంబుగ నున్నది. లాజాజ్య = లాజ+ఆజ్య - పేలాలు నెయ్యి - అశ్మ = రాయి, సన్నికలు. దీనిని వివాహసమయమున నగ్ని సమీపమున నుంచు నాచారము సుప్రసిద్ధము. నవగోమయ శ్యామ = అగ్నివేదిచుట్టును పవిత్రార్థము గోమయోదకముచేత నలకబడినట్లు వర్ణింపబడియె. ఇట్టి యాచారములు. ప్రాచీనకాలము నుండియు నిప్పటివఱకు నుండిన వనుటకు నిది నిదర్శనము.

196. **అనఘులు** = పాపములేనివారు. **అఘము** = పాపము - **కృత మంగళాభిషేకులు** = చేయబడిన మంగళస్నానము కలవారు; మంగళస్నానము చేసినవారు - ధృత = ధరింపబడిన - పూర్ణేందువదన = పూర్ణచంద్రునివలె మనోహరమగుముఖము కలది. ద్రౌపది- విదగ్ధ= నేర్పరులైన - ప్రసాధనములు = బట్టలు మొదలగు నలంకారములు. **భూసురేంద్రులు** = బ్రాహ్మణశ్రేష్ఠులు- ఇంద్రశబ్దము శ్రేష్ఠవాచకము.

197 వితత = విస్తరింపఁజేయబడిన.

199 చపలన్ = **ఆకాశమునందు.** గంధవహుఁడు= వాయువు; వాసనలను వ్యాపింపఁజేయువాఁడు - దేవదుందుభులుమ్రోయుటయు పుష్పవర్షము కురియుటయు పాండవుల వివాహము దేవతాప్రీతికరమైనదని కన్పట్టుచున్నది.

200-203. ఈపద్యములు ఆశ్వాసాంత పద్యములు అశ్వాసారంభంబునవలె కథా సందర్భమునుఁ సూచింపుటయు కృతి పతిని స్తుతించుటయును ఆంధ్రకవిసాంప్రదాయము లై యున్నవి.

200 వైశంపాయనుఁడు= వ్యాసుని శిష్యుఁడు. ఇతడు భారతకథను జనమేజయునకుఁ జెప్పినట్లు గ్రంథమున వ్రాయఁబడినది. జనమేజయుఁడు అర్జునుని కొడుకగు అభిమన్యుని మనుమఁడు - పరీక్షిత్తుని కొడుకు.

202. స్వాగత వృత్తమును, మాలినీవృత్తమును ఆశ్వాసాంతమునఁజెప్పుట యాంధ్రకవి సాంప్రదాయము.

203. గద్యము. ఈవచనము వ్రాయుటకూడ నాంధ్రకవి సాంప్రదాయమే. ఇందు కవి తన కులనామ నిరూపణము చేయుటయు నాశ్వాసము నందలి యంశముల వివరించుటయు నాచారము.

---

# చంద్ర వంశ పురాజుల వంశవృక్షము.

కశ్యపబ్రహ్మ (భార్య. అదితి)

|

వివస్వతుఁడు = సూర్యుఁడు.

|

వైవస్వతుఁడు. | శని. | యముఁడు | యమున | తపతి.

|

ఇల (భర్త; బుధుఁడు చంద్రునికొడుకు) (స్త్రీ)

| పురూరవుఁడు (ఊర్వశి) | బుచీకుఁడు |
|---|---|
| ఆయువు (స్వర్భానవి) | బుక్షుఁడు (జ్వల) |
| నహుషుఁడు (ప్రియంవద) | మతివరుఁడు (సరస్వతినది) |
| యయాతి (దేవయాన) | ద్రసుఁడు (కాళింది) |
| వృషపర్వుఁడు (శర్మిష్ఠ) | నీలుఁడు (రథంతరి) |
| పూరుఁడు (కౌసల్య) | దుష్యంతుఁడు (శకుంతల) |
| జనమేజయుఁడు (అనంత) | భరతుఁడు (సునంద) |

|
ప్రాచీశుఁడు (అశ్మకి)
|
శర్యాతి (వరాంగి)
|
నహుయాతి (భానుమతి)
|
సార్వభౌముఁడు (సునంద)
|
జయత్సేనుఁడు (సుభద్ర)
|
సురాచీనుఁడు (మర్యాద)
|
మహాభౌముఁడు (సుపుష్ట)
|
అయుతానీకుఁడు (భానుమతి)
|
అక్రోధనుఁడు (కరండవ)
|
దేవాపి (మర్యాద)
|
ఋచీకుఁడు (దేవకి)

|
భుమన్యుఁడు (విజయ)
|
సుహోత్రుఁడు (సువర్ణ)
|
హస్తి (యశోద)
|
నికుంభుఁడు (వసుదేవ)
|
అజామీఢుఁడు (కౌసల్య - విశాల - శిక్షు)
|
సంవరణుఁడు (తపతి)
|
కురుఁడు (సుబల)
|
పరీక్షితుఁడు (సుయశ)
|
భీమసేనుఁడు (సుభద్ర)
|
ప్రతీపుఁడు (సునంద)
|
☛ శంతనుఁడు.

☛ శంతనుసంతతి రెండవ వంశవృక్షమున నున్నది.


శంతనుఁడు.
(గంగ భా.)
(భా. సత్యవతి)
భీష్ముఁడు,
చిత్రాంగదుఁడు
విచిత్రవీర్యుఁడు
అంబిక
అంబాలిక
ధృతరాష్ట్రుఁడు(గాంధారి)
పాండురాజు
దుర్యోధనాదులు
100 గురు.
(కుంతి భా.)
(భా. మాద్రి)
ధర్మరాజు.
భీముఁడు.
అర్జునుఁడు.
(సుభద్ర)
నకులుఁడు.
సహదేవుఁడు.
అభిమన్యుఁడు-(ఉత్తర)
పరీక్షిత్తు
జనమేజయుఁడు.

# విమర్శ.

గ్రంథపఠనమునకు ముఖ్యాంగము విమర్శ. గ్రంథమందలి యర్థవిశేషములనెఱింగిన వెనుక గ్రంథాంశముల నన్నింటిని వివేచింపుచు నందలి కథాపురుషుల గుణశీలములను, సందేహాస్పదము లగునట్టి యంశములనుఁ గూలంకషముగ విచారణ చేయుటయు, ధర్మాధర్మభాగములను పరిశీలించుటయు నింకను గ్రంథమునందు గల విశేషంబులగుర్తించుటయు, మొదలగునవి యవశ్యముగాఁ జేయఁదగినవి. గ్రంథపఠనమువలనఁ గలుగవలసిన ప్రయోజనములగు బుద్ధివికసనము సాహిత్యము పాండిత్యము మొదలగునవి కలుగుటకు విమర్శనమేసాధనభూత మగు నభ్యాసము; కావున నీ ద్రౌపదీ స్వయంవరమునందలి కథాంశముల నిచ్చట విమర్శింపనైనది.

గ్రంథవిమర్శనమున కొక నియమము ప్రధానము. గ్రంథమునందుగల శబ్ద శబ్దార్థ వర్ణనాంశముల ప్రమాణమును పురస్కరించుకొనియే విమర్శయుండవలెను. గ్రంథమునందు గలవానిని విడుచుటయు లేనివానిని కల్పించి చేర్చుటయు స్వేచ్ఛానుసారముగ విశేషంబుల వచించుటయుఁ గల్పనములు కాని విమర్శనము కానేరవు. అటుల చెప్పఁబడిన యంశములు అప్రమాణములై అపవిమర్శనము లనఁదగును. కావున నిట్టి విమర్శలక్షణములతో నీగ్రంథాంశములను గుఱించి విచారణ చేయుదము.

## కథాపురుషుల గుణశీలములు.

ఈ ద్రౌపదీ స్వయంవరకథలో వచ్చువా రందఱును మహనీయులుగ గన్పట్టుచున్నారు. అట్టి మహాపురుషులచరిత మగుటచేతనే మహాభారత మను పేరా గ్రంథమునకు కలిగెను. అట్టివారి మహత్త్వ మీద్రౌపదీ స్వయంవరకథయందు నెంతేని సొబగుగ సూచింపఁబడుచున్నది.

(1) పాండవులు :—

ప్రమాణ వచనములు.

22:—మానితులైన పాండవ కుమారులు.

56:—విమలములయి లోకత్రిత
యములఁ బ్రవర్తిల్లుమీ మహాగుణములు.

57:— మేరున గోత్తంసమహీ
భార ధురంధరుల...............గుణా
ధారుల........... ...
.........భరత వంశోత్తములన్.

62:—ధర్మవిదులరు......అఖిలలోక హితులరు.

87:—అవిరళ భస్మమధ్యమున నగ్ని కణంబులువోలె బ్రాహ్మణ
ప్రవరులలోన నేర్పడక పాండవు లేవురు నున్నఁ జూచి.

133:—మీదగు నవారిత తేజము.

148:—అజి నోత్తరీయుల నతిసంభృత బ్రహ్మ
తేజుల సముదితాదిత్యసముల
నాజానులంబి మహాబాహుపరిఘుల
నత్యున్నతాంసుల నతివిశాల
వక్షుల నవిరళ వ్యాయామదృఢకఠి
నాంగుల వృషభాక్షు లయినవారిఁ
..................భరతవంశజుల

............ఘనుల నత్యుత్తమ
క్షత్త్రివంశవరులఁగా నెఱింగి.

పాండవులు గౌరవనీయు లనియు, వారిచరితములు నిర్మలములయి ముల్లోకములను కొనియాడఁబడుచుండు ననియు, వారు భరతవంశమునందలి రాజులందఱిలో నగ్రగణ్యులనియు, స్పష్టముగఁ దెలియుచున్నది. వారు సమస్త భూమండలమును పాలింప సమర్థులు. ధర్మములు బాగుగ దెలిసిన వారును సర్వజనులకును బ్రియమగు నడవడి గలవారును అయియున్నట్లు కూడ తెలియుచున్నది. బ్రహ్మచర్యము నవలంబించి వర్ణాశ్రమాచారములను యథావిధిని జరుపుచు నుండువారు. కృష్ణాజినములు ధరించుటయు మధూకరమెత్తుటయుఁ దాము తెచ్చిన పదార్థములలో నతిథులకు బలులకుఁ గొంత వినియోగించుటయు నిందులకు నిదర్శనములు. సాముద్రికలక్షణములచే వీరు మహాపురుష చిహ్నములు కలవారలై రూపరేఖా విలాసాదులచేతనే మహనీయు లని తెలియఁదగినవారు. కావుననే బ్రాహ్మణులు వారిని చూచిన మాత్రాన ద్రౌపది కృష్ణుని వరించునని తలఁచిరి. ఆజానుబాహువులు ఉన్నత భుజములు విశాలవక్షస్థలములు వృషభాక్షములు సూర్యకాంతి బ్రహ్మతేజస్సు యివి యన్నియు వారి సాముద్రికలక్షణములు. వీరు దేహపరిశ్రమము నకై వ్యాయామముచేసి దేహపటుత్వమును వృద్ధిపరచినవారు. ఇది అప్పటి కాలమునకూడ క్షత్త్రియులకు విహితమని యెఱుంగునది. ధర్మజ భీమార్జునులు ముగ్గురును నకుల సహదేవు లిద్దరును సవతుల బిడ్డలయ్యు నత్యంత ప్రేమతో మెలంగుట వారియోగ్యతను తెలుపుచున్నది. 'పితృసమో జ్యేష్ఠః' అను వచనమున కనుకూలముగ తమ్ములందఱును ధర్మరాజునందు భక్తికలిగి యుండుటయుఁ బితృసమముగ వారి నాతఁ డత్యంతప్రేమతోఁ జూచుచుండుటయు వారి యోగ్యతనే వ్యక్తపఱచుచున్నవి.

(2) ధర్మరాజు :—

ప్రమాణ వచనములు—

**35:**—ధర్మసుతుఁ డున్నచోటను
ధర్మమునకు హానిగలదె • ధారుణినైనన్.

**47:**—అని యరచుచున్న దానికి
ననఘుఁడు గరుణించి పాండవాగ్రజుఁడయ్య
ర్జునుఁ జూచి వీని విడువుమ
యని నోడినవాని హీనునపగత శౌర్యున్.

**213:**—ఇట్లు పాంచాలియందు బద్ధానురాగులయి యున్న తమరో
వుల యభిప్రాయ మెఱింగి.

**214:**—గురువచనస్థితి మనకే గురుతును నిది పత్నిగాఁ దగున్.

**216:**—అజాత శత్రు నృపలోకారాధ్యు నుద్యద్గుణ
భ్రాజిష్ణుం............బాలార్కతుల్యోజ్జ్వల
త్తేజున్ ............

**244:**—నీవు లౌకిక వైదిక ధర్మస్వరూపవేదివి......నీపలుకులు ధర్మ
విరుద్ధంబులని పలుకనోడుదుము.

**247:**—తన పలుకు లోకమెల్లను
గొనియాడఁగఁదగినలోకగురుఁ డీయమనం
దనుఁడు.........

**251:**—నగియును బొంకునందు వచనంబున ధర్మువునందుఁ జిత్తముం
దగులదు నాకు నెన్నఁడును ధర్మువవశ్యమునట్ల కావునన్
............
దగదని దుర్విచారములు దక్కి.

**253:**—గురులలోనఁ బరమ • గురువు దల్లియయట్టి
దల్లివచనమును విధాతకృతియు
నన్యథాకరింపనలవియె.........

**255:**—ధర్మ తత్త్వజ్ఞుఁ డీ • ధర్మతనూజుండు
ధర్మమార్గంబేల • తప్పఁబలుకు

ధర్మరాజు పాండవులవిషయమై వెనుకఁ జేర్కొనినట్లు మహాపురుషలక్షణ సంపన్నుండును అత్యుత్తమ క్షత్రియ బ్రాహ్మణధర్మముల నవలంబించువాఁడు నని తెలియుచున్నది. ఇతఁడు గౌరవర్ణముగల దేహచ్ఛాయ గలవాఁడు. ఆజానుబాహువులు అత్యున్నతాంసులు సూర్యకాంతి బ్రహ్మతేజస్సు విశాలవక్షస్థలము వృషభాక్షములుకలవాఁడు.

ధర్మరాజు పరమధార్మికుఁడని అంగారపర్ణుని విడిపించి రక్షించుటవలనఁ దెలియుచున్నది. యుద్ధమున నోడినవానిని మరి బాధింపఁగూడదను ధర్మమును బాటించి అట్టివారికి ప్రాణదానముచేసి రక్షించుటవలన నితని ధర్మబుద్ధి తెలియుచున్నది. ద్రౌపదీవివాహవిషయమున తనతమ్ములు నలువురయభిప్రాయంబును కనిపెట్టిన నేర్పరితనమువలన నితని పరేంగితజ్ఞానము విశదపడుచున్నది. 'న మాతుః పరదైవతమ్' అను న్యాయపరిపాలనమున కితఁడే సాటియని యాతనివచనములవలన తేటఁపడుచున్నది.

ధర్మరాజు తనయంతఃకరణప్రవృత్తివిషయమునఁ బలికినవచనము లీతని మనోధైర్యమును బరిశుద్ధతను బోధించుచున్నవి. కాని యాతఁడు తన విషయమున నట్లుపలుకుట ఆత్మస్తుతిగఁ గన్పట్టుచున్నది. కాని యట్లూహించుటకు వీలులేదు. తమయేవురు మనోనిశ్చయమును వ్యాసునివాక్యమును మాతృనాజ్ఞయు నొక్కరీతిని గన్పఱచుచుండ నందువిషయమై యన్యథాచింతించుట యనుచితమనిదృఢముగ వచించుటకార్యగౌరవమును సూచించుచున్నది గాని యాత్మస్తుతి యనఁజనదు. ఇటులనే పూర్వము దుష్యంతుడును శకుంతలజన్మమును స్థిరపరచువిషయమున నిర్ణయించెను.

శ్లో॥ అసంశయంక్షత్త్రపరిగ్రహ క్షమా
యదార్య మస్యా మభిలాషి మే మనః
సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః

అర్థము:—ఏ కారణముచేత యోగ్యమగు నామనస్సు ఈ శకుంతలను అభిలషించుచున్నదో ఆ కారణముచేత ఈచిన్నది నిస్సంశయముగ క్షత్త్రియుఁడు పరింపఁదగినది. ఏలయన సత్పురుషులకు వస్తువిషయమున సందేహము కలుగుచుండగా వారి యంతఃకరణప్రవృత్తులే ప్రమాణము లగుచున్నవి.

ఇట్లు కాళిదాసు శాకుంతలనాటకములో దుష్యంతుని వాక్యమును రచించెను. కావున నట్టివాక్యమును ఆత్మ స్తుతి యనఁ జనదనియు వారి మనోదార్ఢ్యమును అంతఃకరణ పారిశుద్ధ్యమును వ్యక్తపఱచుటయే ప్రయోజన మనియు గ్రహింపఁదగి యున్నది.

ధర్మరాజుయొక్క ధర్మదీక్ష మొదలగు యోగ్యగుణములను వ్యాసులవారును శ్రీకృష్ణుఁడును ద్రుపదుఁడును శ్లాఘించుట యాతనికి ధర్మరాజను పేరు సార్థకమై యట్టి బిరుదున కతఁడే తగునని కన్పట్టుచున్నది. లోకమెల్లను గొనియాడఁదగిన లోకగురుఁడని ద్రుపదుఁడు పొగడుటయు ధర్మసుతుఁడున్నచోటను ధర్మమునకు హాని కలుగదని వ్యాసులు స్తుతించుటయు జూడ నాతని పవిత్రాంతఃకరణమును ధర్మపరతంత్రతయు వెల్లడియగుచున్నవి.

(3) భీముఁడు :—

ప్రమాణవచనములు.

107:—భీముండు నొక్క వృక్షంబు పెఱికికొని

108:—ఆతని కెలన మహావృక్షహస్తుఁడై
యున్న వీరుండు వృకోదరుండు.

117:—బలిమి భీముఁడొండె బలదేవుడొండెఁగా
కొరులు నరులు శల్యు నోర్వఁగలరె

135:—పెడద యురంబును నన్నువ
కడుపును దృఢకఠిన తనువుఁగలయాతనికిఁ
దొడర నొకపాలు వెట్టుము
పది నాగాయుతబలంబు వాఁడతఁడబలా.

భీముండును సర్వలక్షణములచేత తనసోదరులవంటివాఁడు. ఇతనికి గలయధికమేమన నితఁడు మహాబలుఁడు. పదివేలయేనుఁగులకు గల బలము గలవాఁడు. దీనికిగారణ మతఁడు వాయుదేవునకు పుత్రుఁడగుట. ఇతనికి జఠరపుష్టి హెచ్చు. కావున నమితాహారము తినును. తక్కిన యన్నదమ్ము లందఱకును తల్లికిని ద్రౌపదికిని కలసి యొకపాలుచు ఇతని కొక్కనికిని నొకపాలును అన్నము పెట్టుదురు. ఇతనిశరీరము మిగులకఠినమైనది. ఇతఁడు పుట్టినపది యవ దివసంబున తల్లికుంతి పురిటిబిడ్డను దేవతాదర్శనమునకు గొనిపోవుచుండ దారిలో నొకపులి ఈమెపయిఁ బడఁబోయెను. అప్పుడు పాండురాజు పులిని తెగనేసెను. ఆసమయమున నామెభయపడి బిడ్డను రాతిపయిబడ వైచిన నారాయి గుండ (చూర్ణము) అయ్యెను. అట్టి మృదువైనశరీరము భీమునిది.

మహాబలశాలిగాన నితనికి నుత్సాహముకలిగి యుద్ధముచేయునపుడు పెద్దచెట్టు పెరికి దానితో ప్రజలను మోదువాఁడు. శత్రువెంత బలవంతుడైనను చేతులతో నెత్తివిసరువాఁడు. కావుననే శల్యునట్లు ద్రెళ్లవైచెను.

(4) అర్జునుడు:—ప్రమాణవచనములు:—

24:—ఇంద్రసమానునకున్ .........

48:—అనిన నరుఁడు వల్లె • యని వానికనియె గం
ధర్వ నిన్ను గరుణ • ధర్మరాజు.
గురుకులేశ్వరుం డ • శరణశరణ్యుండు
విడువఁబంచె నింక • వెఱవ కుండు.

54:—ఎంత మిత్రులైన • నెన్నండు నొరులచే
విద్యయును శుభంబు • వి త్తచయముఁ
గొనగ నొల్లనాకుఁ • గూర్తేని ననలాస్త్ర
మనఘ నీవు గొనుము • హయములిమ్ము

75:—మాయింధును గృష్ణు నుదం
స్వాయతభుజుఁ జూచితానశాపార్షమున్మోదం
దోయజనుఖి పరిగ్రహించును,

92:—అగ్రజు ననుమతంబున విప్రసభ వెల్వడి.

95:—అమితోత్సాహుఁడు దీర్ఘబాహుపరిఘుం, డత్యంత తేజస్వి, ప
ద్మవిమలాచారుఁడు విష్ణుభక్తిపరుఁ, డీవిప్రుండు.

96:—అయ్యర్జునుండు నవ్వింటి సమీపంబునకు వచ్చి గురువృద్ధుం
దలంచి నమస్కారంబు సేసి ధనువునకుఁ బ్రదక్షిణంబుఁ జేసి మ్రొక్కి.

102:—సురరాజ సన్నిభు నభినవ
యౌవనోద్భాసితు నసితరత్న
రుచిరాంగు నంగజరూపు ధనంజయుఁ

113:—నీ వప్రాకృతబలుఁడవు.

117:—పరశురాము డొండె హరు డొండె నరు డొండెఁ
గాక యొరులు గలరె కర్ణుఁ గెలువ.

124:—పెద్దవాఁడుండ గొండిక వాఁడు వివాహంబగుట ధర్మవిరు
ద్ధంబుగావున దీని నగ్రమహిషిఁగాఁ బరిగ్రహింపుము. మానలువురయను
మతం బిట్టిద.

152:—శుభ చారిత్రుఁడు.

అర్జునుఁడు ద్రౌపదీస్వయంవర కథకు నాయకుఁ డనదగును. ఇతఁడు పాండవులందఱవలె మహాపురుషలక్షణసంపన్నుం డయినవాఁడు. ఇతనిదేహచ్ఛాయ కృష్ణవర్ణము. అన్నదమ్ములందఱిలో రుచిరాంగుఁడును మన్మథరూపుఁడు నని యున్నది. ఇతఁడు ఇంద్రపుత్రుఁడగుటంజేసి యట్టిమనోహరరూపవంతుం డయ్యెననుటకు సందియంబులేదు. అట్టి రూపవంతుఁడగుటయే యితనిని ద్రౌపది 'తాన హర్షముతో వరియించు'నని బ్రాహ్మణు లనుటకు గారణము.

ఇతఁడు ధనుర్విద్యయందు పరిపూర్ణుండును అప్రతిద్వంద్వుండు నవఁ బడినవాఁడు. కనుక నే మత్స్యయంత్రభేదన మతనిచే నిర్వహింపఁబడెను. కర్ణుఁడును ధనుర్విద్యయందు పరిపూర్ణుండయ్యు నతనిచే నోడినవాఁడు కాన నర్జునుమహాత్త్వమసమాన మని తెలియుచున్నది.

అర్జునునియందు మిగుల శ్లాఘనీయము లగు కొన్ని గుణాతిశయములు కలవు. ఇతనికి ధర్మరాజునందు నత్యంతభక్తి. వింటిని సమీపించినపుఁ డన్న గారి యనుమతిని పొంది వెళ్లెను. జ్యేష్ఠసోదరునకు వివాహము కాకుండ తాను వివాహ మాడఁగూడదను పూనికయుఁ దాను స్వయంవరమునఁ బడసిన కన్యకను ధర్మనందనునకు సమర్పించుటయు నాతని యానతికి తా నియ్య కొనుటయు నతని ధర్మపరతంత్రతను వెల్లడి చేయుచున్నవి. ఇతఁడు అం గార పర్ణుని వలన విద్యయు విత్తము శుభమును గ్రహించుట కొప్పుకొన కుండుట యీతని అప్రతిగ్రహమును బోధింపుచున్నవి. తాను గ్రహింపకున్న ను అంగార పర్ణునకు తన యాగ్నేయాస్త్రము నిచ్చుటకు వెనుదీయలేదు. ఇతనికి శుభచారిత్రుం డనియు విమలాచారుఁడనియు విష్ణుభక్తిపరుఁ డనియు ప్రఖ్యాతి కలదు. ఇతఁడు ధనుస్సమీపమునకు బోవునపుడు గురువులను తలంచుటయు ధనువునకుఁ బ్రదక్షిణంబు గావించుటయు నీతనికి దైవిక విశ్వాసము మెండని తెలియఁజేయుచున్నది. కర్ణుఁడును వీని సామర్థ్యమును జూచి యాశ్చర్యము నొంది యతఁ డప్రాకృత మగుబలము కలవాఁడని వచించుటచేత నర్జునుని యమానుషసామర్థ్యము తేటఁపడుచున్నది.

(5) (6) నకుల సహదేవులు:—వీరును అన్ని విధముల చేతను అన్న లవంటి వారే; కాని విశేషము లెవ్వియు కానరావు.

(7) అంగార పర్ణుఁడు:—

ఇతఁడొక గంధర్వుఁడు. గంధర్వులు సాధారణముగ గానముచేయుచు వినోదించుచు స్త్రీలోలురై యుండువారు. వీరి సంచారకాలములు అర్ధరాత్ర ములు రెండు సంధ్యావేళలు. ఆసమయములందు వారు స్వేచ్ఛావిహారములు

సలుపుచు నదీతీరమునకుంజనియందు జలక్రీడల సలుపుదురు. అట్టిసమయమున నెవరు వారికినగుపడినను బాధింతురు. వారు మిగులబలవంతులుకాన వారికి నందఱును భయపడుదురు. వారినెవరును యెదిరించి గెలువఁజాలరు. అంగార పర్ణుండును నట్టివాఁడు. కావుననితనికిని యర్జునునకును జగడము వచ్చెను. అట్టికయ్యమునవోడినను అంగారపర్ణుని ధర్మరాజు విడిపించి ప్రాణదానము చేసెను. అతఁడును వారిధర్మబుద్ధికి మెచ్చి వారియెడల స్నేహభావము కలిగి వారిసేమంబునకై కొన్నియుపకారములజేసెను. అర్జునునిచే నోడిన పిదప సిగ్గుచెంది తనపూర్వనామమును విడిచి చిత్రరథుఁడను పేరుపెట్టు కొనెను. కాని ద్రుపదుఁడు ద్రోణునియెడల నడచినట్లు వారియెడలవైరము పూనలేదు. ఇది యీతనిసౌమ్యతను తెలుపుచున్నది. గంధర్వులును దేవగణ ములలోని వారగుటంజేసి సాధుబుద్ధి గలవారు. కావున నట్టిసౌమ్యబుద్ధి యీతనికిఁ గలిగినది. ఇతనికి చాక్షుషియనునొక విద్యకలదు. దాని మహిమ చేత వానికి మూఁడులోకముల సమాచారములును తెలిసికొను సామర్థ్యము కలదు.

ఇంకను నీవిద్యమహిమవలన గంధర్వులు దేవతలచేత నయితము శాసింపంబడక మనుష్యులకంటె నెక్కుడు వారలై స్వతంత్రులైయుం దురు. ఇతఁడు పాండవులకు పురోహితుని సంపాదింపుఁడని బోధించి యందులకుందగిన బ్రాహ్మణునిధౌమ్యుని నిర్దేశించి వారికిఁ గొప్ప యుపకా రముఁ గావించెను. వారియెడలఁ గలప్రీతిచేత నర్జునునకు చాక్షుషీవిద్య నియ్య సమకట్టెనుగాని యీతఁడు స్వీకరింపలేదు. గొప్పశక్తులుగల గంధ ర్వాశ్వంబుల నయిదునందలను పాండవులేవురకును నిచ్చెద ననెను. అర్జు నుఁడు వానిని పుచ్చుకొనుట కంగీకరించి ప్రయోజనంబు గలనాఁడు గొని పోయెద మని చెప్పి వాని నతనియొద్ద నుండనిమ్మనెను.

(8) వ్యాసులు:—ఇతఁడు మహాముని. చతుర్ముఖబ్రహ్మకు మను మని మనుమఁడు. బ్రహ్మమానసపుత్రుఁడు వసిష్ఠుఁడు. ఇతనికుమారుఁడు శక్తి

శక్తితనయుడు పరాశరుఁడు. ఇతనికిని సత్యవతికినిఁబుట్టినవాడు వ్యాసులు. ఇతని తొలిపేరు కృష్ణుఁడు. ద్వీపమునఁబుట్టుటంజేసి కృష్ణద్వైపాయనుఁడను పేరు లోకవిదిత మైనది చిత్రాంగదవిచిత్రవీర్యులకు సంతానములేక పరలోకగతులుగానక సత్యవతీప్రేరణంబున వ్యాసులు విచిత్రవీర్యునిభార్యలగు అంబికాంబాలికలవలన ధృతరాష్ట్ర పాండురాజులంగని వంశోద్ధరణంబు గావించెను. కావున వ్యాసులు పాండవులకు పితామహుఁ డనఁబడెను.

ఇతఁడు పురాణముల నన్నింటిని వ్రాసినవాఁడు. ధర్మసూక్ష్మములఁ జక్కఁగఁ దెలిసినవాఁడు. సూర్యసంకాశమగు తేజస్సుకలవాఁడు. అందఱయొక్కయు బాధలను అజ్ఞానమును పోగొట్టువాఁడు. మునివృత్తినుండు గావున నితని కేకోర్కెలు లేవు. ఇతఁడెప్పుడును లేడితోలును ధరించి తిరుగుచుండును. ఇతని సంభాషణము వినువారలకు హితవుగను మనోహరముగను నుండి సత్యమును ధర్మమును అనుసరించియుండును. ఇతనికి తపశ్శక్తిచేత భూతభవిష్యద్వర్తమానములు స్పష్టముగాఁ దెలియును.

పాండవులు ధర్మస్వరూపులు కావున వారియెడల మిగుల ప్రేమ కలిగి వారికి కార్యాలోచనపరుఁడై వారలనేమంబును కనిపెట్టువాఁడు. కనుకనే వారలకు మూఁడుమారు లగుపడి తా నెఱింగిన వృత్తాంతములఁదెలిపియు వారికిఁ గార్యానుకూలముగఁ దోడుపడుటయు నొనర్చుచుండువాఁడు. దుర్యోధనాది కౌరవులును ఇతనికి పౌత్రులే; కాని వారియెడల నిట్టి ప్రేమాతిశయము కలిగి సంచరించునటు లగుపడదు. ఇందులకుఁ గారణము వారి దుర్వృత్తియే, ధర్మమునకుఁదోడుపడుటయే యుత్తమలక్షణము గాన నట్లు వ్యాసులు సంచరించుట యసంగతము గాదు. అధర్మశీలు రగుతనవారి నైనను విడుచుటయు ధర్మమార్గపరులు పెరవారలైనను వారికి తోడుపడుటయు మహాత్ముల లక్షణములు.

(9) ద్రుపదుఁడు:—

ద్రుపదుఁడు పరమ ధార్మికుఁడనియు సద్గుణవంతుఁడనియు ప్రఖ్యాతి చెందినట్టు కన్పట్టుచున్నది. ఇతఁడును ధర్మమార్గపరుఁడనియు సదాచారము నవలంబించు వాఁడనియు నీతని ప్రవర్తనమువలననే తెలియుచున్నది. ద్రౌపదీవివాహ మొనరించుటలో పంచపతిత్వము లోకాచార విరుద్ధంబనియు శాస్త్రదూష్యం బనియుఁ దలఁచియే యంత నిదానించి పరిశీలించినఁ గాని యొప్పుకొనఁడయ్యె.

ద్రోణునియెడల నడచిన నడతవలన నీతనియం దొక లోపము కన్పట్టుచున్నది. తన బాల్యసఖుఁ డని యాశఁజెంది వచ్చిన ద్రోణుని నిరాకరించుటవలన నాతని రాజసధర్మమును అసాధు చిత్తమును విశద పడుచున్నవి. తరువాత ద్రోణుఁడు తనకు బుద్ధిసెప్పఁదలఁచి యర్జునునిచే నతని నోడించినపుడు తన పూర్వపు లోపమును యాదికిఁ దెచ్చుకొని సిగ్గుపడి సర్దుకొనక ద్రోణుని వధింప సమర్థుండగు కుమారుఁడు కలుగవలె నని వేడి విశ్వ ప్రయత్నము చేసి విశేషధనవ్యయము చేసి తనకోర్కె నీడేర్చుకొనెను. ఆ సందర్భమున-

15:—పడరత్ని ధనుర్ధరుఁడై
య్యెడ నజితుఁడు గాన వాని హీనుంగాఁ జే
యుఁడు నాకుఁ జతుర్వర్గము
వడయుట యని—

ద్రోణుఁడు వచించిన మాటలవలన నాతని దీర్ఘక్రోధము తెలియుచున్నది. ద్రోణుని యాగ్రహమునకును ద్రుపదుని క్రోధమునకును వ్యత్యాసము గుర్తింపఁదగినది. ద్రోణుఁడు ద్రుపదునకు బుద్ధిచెప్ప దలంచెనేగాని యాతని కేమియు నపాయము సేయలేదు అతనిని చిన్నపుచ్చి పొమ్మనెను. ద్రుపదుఁడు ద్రోణుని మరణము నపేక్షించి తన కట్టి శక్తి లేకుండుటచే నందునకు సామర్థ్యముగల కొడుకుం గనుటకు విశ్వప్రయత్నము చేసి కృత

కృత్యాకృత్యములు: ఈవిధముగనున్న బ్రాహ్మణ క్షత్రియుల క్రోధముల భేద మింకొక సందర్భమున నన్నయచే వర్ణించినది తెలియందగును.

ఉ. నీరదుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా
 ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ
 రెండును రాజులందు విపరీతము గావున.

(మహాభారతము. ఆదిపర్వము. ఆ ౧. ప ౧౦౦.) ఈపద్యార్థమునకు ద్రుపదుఁడును ద్రోణుఁడును నిదర్శనము లయి యున్నారు.

ద్రుపదుఁడు ద్రోణుని వధింపఁగోరుట మఱియొక హేతువుచేతఁ గూడ నయోగ్య మనఁదగును. ఆకాలపురాజులు బ్రాహ్మణభక్తిపరు లయి వారివలన లోపమున్నను వధ్యులు గారని తలచు చుండురని

105:—"ఏమిదోషంబు సేసియు బ్రాహ్మణుండు వధ్యుండు గాఁడు. మనరాజ్యంబును నర్థంబును బ్రాహ్మణార్థంబ కావున నవ్విప్రుతోడిదేమి?" అనువచనమున స్పష్టముగఁ గన్పట్టు చున్నది. అట్టి వివేకము ద్రుపదు నందు లుప్తమైనది. యౌవనమును రాజ్యమదాంధతయుఁ గారణములుగాన నట్టి విప రీతస్ఫూర్తి యాతనికిఁ గలిగెనుగాని యితర విషయములవలన నాతఁ డుత్తమ క్షత్రియుఁడును రాజశ్రేష్ఠుఁడని ప్రసిద్ధి వడసెను. ద్రుపదుఁడు తన మొదటి సంకల్పము నెరవేరలే దను వ్యసనముచేత ద్రౌపదీస్వయంవర ప్రచారమంత యు ధృష్టద్యుమ్నునిచేఁ గావించి తాను తటస్థముగ నుండెను. తుదకు తన సంకల్ప మమోఘముగ నెరవేరెనని తెలిసి యానందము నొందెను.

(10) శ్రీకృష్ణుఁడు:—

శ్రీకృష్ణుఁడు శ్రీమన్నారాయణుని యవతారము. ఆయన పాండవులకుఁ గార్యసహాయుండు. కావున వారి సేమం బరయుచు వారియెడల ప్రేమానురక్తము చూపుచుండువాఁడు. ద్రుపదుని సభలో పాండవులను బోల్చి యర్జునునకు ద్రౌపదిని పరిగ్రహింపుమని సంకల్పించెను. అనంతరమున హేతువన్న

చోటికి జని వారిని సందర్శించి కుశలప్రశ్నంబులచేత వారి నానందింపఁ జేసెను. తరువాత దుర్యోధనాదులు వారి నిజరూపం బెఱుంగఁగోరి చేయు ప్రయత్నములను నైపుణ్యముచే నివారించి వారిని మరలించెను. ఈయంశము లచే నతనికి పాండవులయెడ నున్న ప్రేమాతిశయము విశద మగుచున్నది.

(11) కుంతీదేవి:--

కుంతీదేవి మహాపతివ్రత యగుటంజేసి యామె వాక్కు అమోఘము. కనుకనే ద్రౌపది విషయమై యజ్ఞానమున పలికిన వాక్కుసహితము జరగక తప్పినదికాదు. కుంతియొక్క నిపుణత్వము-

31:—అడుగకయ విప్రవరులకు
నడరఁగ నర్ద్దేశమున గృహస్థులు భక్తిం
గుడుపఁగఁబెట్టుదు రెప్పుడు
గడు హృద్యము లయినమోదకంబులతోడన్.

అను పద్యార్థమున స్పష్టమగుచున్నది. తాము నిజముగ బ్రాహ్మణు లని దగ్గరవారికి నమ్మకము పుట్టుటకు నిట్టిమాటలు పలికెను.

(12) ద్రౌపది:—

ద్రౌపది కృష్ణవర్ణము కలదిగాన 'సితేతరోత్పల కోమలామలవర్ణ' యని వర్ణింపఁబడెను. ఆమె తామరపువ్వురేకులవంటి కన్నులు గలది. తుమ్మెదలవలెనుండు ముంగురులు గలది. దివ్యమగు శరీరకాంతియును కలువపువ్వుల పరిమళమువంటి సువాసనయును గలది.

ఆమెకులపవిత్రయని వర్ణించుటచేత మిగుల సుగుణవంతురా లనియు పతివ్రత యనియు నెఱుంగవలెను. కుంతియెడల వినయసంపత్తి కలిగి యామె యేర్పరచినరూపున నన్నిపనులను జక్కబెట్టుటచేత నామె సుగుణసంపద తెలియుచున్నది.

ద్రౌపదియొక్క తెలివితేటలుకూడ కథాసందర్భమునఁ గనఁబడు చున్నవి. 'కన్యా వరయతే రూపం' అను న్యాయమునుబట్టి పాండవులయెడల

గల మహాపురుషలక్షణము లన్నియుఁ గన్పట్టుటచేత నామెకు వారియెడ ప్రీతి కలుగుట సహజమేకాని వారియునికితమునుబట్టి నిరాకరణబుద్ధి పుట్ట వలసియుండెను. వారివచోధోరణియును వ్యాపారమును కనిపెట్టి వారు మహానుభావులును లోకారాధ్యులు నను నిశ్చయ మామెమనంబున జనించుట చేతనే వారియెడల నిండుమనమున సంచరించి వారిపాదములకు నుపధాన భూత యయ్యెను.

తక్కినవారినిగురించిన విషయములు విపులముగ లేకుండుటంజేసి చదువరులు వానిని స్వయముగాఁ బరిశీలింతురుగాకయని విడిచిపెట్టనైనది.

---

## II ముహూర్తములు

### (1) స్వయంవర ముహూర్తము.

25-వ వచనమున ద్రౌపదీ స్వయంవరము 'పౌషమాసంబున బంచమియు రోహిణినాఁడు' అని యున్నది. గ్రంథమునఁ బక్షము తేటపడకుండినను శుక్లపక్ష మని స్పష్టపడుచున్నది పుష్య పౌర్ణమి పుష్యమీనక్షత్ర యుక్తముకావలెను గాన పుష్యమికి పూర్వనక్షత్రమగు రోహిణి పౌర్ణమికి ముందు రావలెను కనుక శుక్లపక్ష మని స్పష్టపడుచున్నది.

పంచమియు రోహిణినాఁ డనుటలో నొక యసంగతమున్నది. రోహిణి పుష్యమికి వెనుకనైదవ నక్షత్రము. ఈ రెండు నక్షత్రములకును వ్యవధి మూఁడు నక్షత్రము లున్నవి. కావున రోహిణీదివసమునకును పౌర్ణమికిని నడుమ మూఁడు దినములు వ్యవధి యుండవలెను. దీనినిఁబట్టి రోహిణి పుష్య శుద్ధ ఏకాదశినాడు కావలెనని స్పష్టమైనది. విశేషసూత్రముచేత పుష్యశుద్ధ పౌర్ణమికి పునర్వసు పుష్యములలో నొకటి కలియు నని యున్నది. దీనినిబట్టి చూచినచో రోహిణి పౌర్ణమికింకను దగ్గర పడవలెను. కాని వెనుకపడుటకు

హేతువు కనఁబడదు. సిద్ధాంతగణితరీతి నొకటి రెండు దినములు వ్యత్యాసము కలుగుచుండుటఁ గనుచున్నారము కాని యైదారుదినములు వెనుకఁబడుటకు హేతువు లేదు. ఇట్టి సిద్ధాంతమునకు విరుద్ధముగా నైదారు దినములు వెనుకనుండు పంచమినాఁడు రోహిణియగుట యసంగతము.

యుగాంతర వ్యవస్థచే నిట్టిభేద ముండునేమో యని యూహించితిమా. త్రేతాయుగాంశమగు శ్రీరామనవమీ పునర్వసు నక్షత్రములును ద్వాపరయుగాంశమును భారతకాలీయంబును నగు శ్రీకృష్ణ జన్మాష్టమీరోహిణీ నక్షత్రములును ఇప్పటికిని ఈషద్భేదముతో సరిపడుచునే యున్నవి. అట్టి విషయములో ఈ భాగమున నిట్టి వైరుద్ధ్యమునకు హేతువు కనఁబడదు. ఈ కారణములనుబట్టి ఈ వాక్య మసంగత మని నిర్ణయింపనైనది. ఇట్టి యసంగతము నన్నయరచితగ్రంథమం దెట్లు వచ్చెనో యూహింపవలసి యున్నది. నన్నయయే యిట్లు వేసియుండిన నతనికి సిద్ధాంతభాగము తెలియదనియు నట్టి యజ్ఞానకారణమున బామరోక్తుల ననుసరించి యేదో మంచి తిథి నక్షత్రములు వేసినబాగుండు ననియెంచి యతఁడట్లు వేసియుండవలెను. మహాపండితుఁ డగు నన్నయయం దిట్టిలోపము లుండునని తలంచుట కూడ కేవలము అసంగతము. తాళపత్రాదిలేఖక గ్రంథముల ఛిద్రములను పూరించుటలో ఇటీవలివార లీపొరపాటు మాటను వేసి యుండవచ్చునని యూహింపవలసి యున్నది.

మరియొక పాఠమున-

'నేటికిం బదియేనగు దినంబునఁ బౌష్యమాసంబునందు శుక్లపక్షంబునం దష్టమీ రోహిణినాఁడు.'

అని యున్నది. ఇదియు వ్యవధి తగ్గించినను సిద్ధాంతభాగమునకు సరిపడి యుండనట్లు స్పష్ట మగుచున్నది. ఇట్టి పాఠాంతరము లుండుటచేత నా భాగము పూర్తిచేయవలసి యుండినట్లును లేఖకులు తమ స్వకల్పనముల జేర్చుచుండి రనుటకు బాధకము కలుగుచున్నది.

అన్ని భాగములను విచారణచేసి చూడ పేకాదశినాఁ డనిన సరిపోవు నని నిర్ణయింపనైనది.

## (2) వివాహ ముహూర్తము.

ఈ ముహూర్తము కూడ రోహిణియందు శశాంకుఁడున్నాఁడని యున్నది. కనుక మాఘశుద్ధదశమి కావచ్చు నని నిర్దేశింప నగును.

## (3) స్వయంవర వివాహములకు వ్యవధి.

స్వయంవరమునకును వివాహమునకును నొక నెల వ్యవధి యుండిన ట్లగపడుచున్నది. స్వయంవరము తరువాత పాండవులు సుఖముగా కొన్నినాళ్లు ద్రుపదు నింట నుండిన ట్లగపడుచున్నది.

151-వ వచనమున.

'సామప్రియ భాషణంబుల నభీష్టప్రియసత్కారంబులను వారిం బూజించి యొక్కనాఁడు' అనుటయు

157-వ వచనమున

'ఇంక నీవును నేనును గుంతీదేవియును ధృష్టద్యుమ్నుండును విచారించి యెల్లి నిశ్చయింతము.

అనుటవలనను స్వయంవరదినముననే వివాహ మయ్యె ననుటకు వీలు లేదు. కనుక రోహిణి తిరిగి వచ్చిననాఁడు అనఁగా నిరువది యెనిమిది దినములనాఁడు వివాహము జరిగెననియు నంతదనుక పాండవులు ద్రుపదునింట నుండిరనియు నిశ్చయింపనైనది.

## III హిందూమత సిద్ధాంతములు.

### (1) జన్మాంతరము.

హిందూమత సిద్ధాంతములలో నొకటియై వానిలో నగ్రగణ్యమగునట్టి పునర్జన్మము లున్నవను విషయము ఈగ్రంథమున విశదముగ దృఢపఱుపఁబడుచున్నది. జీవుఁడుపుట్టుచుఁజచ్చుచు ననేకవిధశరీరములఁ జొచ్చి వెలువడుచు నుండు ననియును ఒకజన్మమునందుచేసిన కార్యఫలములను పరజన్మములయందు ననుభవించుననియు పూర్వజన్మవాసనలు పరజన్మలందు ప్రబలములయి జీవుని బంధించుననియు హిందువు లందఱునుఇప్పటికిని నమ్ముచునే యున్నారు. ఈవిషయమును ఇతరమతస్థులు ఒప్పుకొనరుకాని మనుష్యలోకమున కనఁబడు బహువిధవ్యత్యాసములకు హేతువు లీసిద్ధాంతమువలన తేటపడునట్లు ఇతరమత సిద్ధాంతములవలన సమాధానముగ నుండవు.

జీవునకు అనంతత్వమును శాశ్వతత్వమును సర్వమతములవారును ఆపాదించియే యున్నారు. హిందూమతమున జీవునకు ననాదిత్వము కూడ నాపాదింపఁబడినది. అట్టి శాశ్వతునకు ననంతంబగుకాలంబున నొక్కజన్మమే యుండు ననియుఁ దక్కిన యీపత్కాలమును జీవుఁ డొక్కరీతి నుండు ననియు ననుటకంటె జీవునకు దేహాంతరవాస ముపపాదించుట యొక్కువ యుక్తియుక్తముగ నున్నట్టు కన్పట్టును. ఇట్టి సిద్ధాంతమునందు విశ్వాసబుద్ధిని స్థిరపఱచుటకు నీద్రౌపదీస్వయంవరమున నిదర్శనములు మెండుగఁ గనఁబడుచున్నవి.

నలునికూతు రగు నింద్రసేన మూఁడవజన్మమున ద్రౌపదియై పాండవు లేవురకును భార్య యయ్యెను. మొదటిజన్మమున మౌద్గల్యుఁడను మునిభార్యయై యాతనిని అయిదురూపములనొంది తనకోరికలను తీర్పవేడినది. అట్టి వాసనాప్రాబల్యముచేతనే రెండవజన్మమున కాశిరాజుకూతురై పుట్టి భర్తృలాభమునొందలేక శివునికై తపంబుచేసి యత్యాసక్తిచేత వేను

మారులు పతింగోరిన శివుఁడు కరుణించి యామెకు జన్మాంతరమున పంచ భర్తృలాభము కలుగునట్లు వరమిచ్చెను. పంచపతులు కావలె ననుకోరికచే నట్లు పలుకకున్నను పూర్వజన్మవాసనయే యట్లిపలుకునకును వరమునకును కారణమైనది. ఇట్టివాసనాప్రాబల్యముచేతనే ద్రౌపదికి పాండవులేవురి యందును సమానానురాగము కలిగెను.

పాండవులయెడం గూడ నిట్టి పూర్వజన్మ వాసనా ప్రాబల్యము కనుపట్టుచున్నది. ద్రౌపది పూర్వ జన్మమున కాశిరాజు కూతురై యుండు నపుడు ధర్మవాయువాసవాశ్వినులు తమయంశజులకు దేహాంతరమునఁ బత్ని గావలయునని యామెను వేడి చనిరి. పాండవులు వారి యంశముల వలన పుట్టినవా రగుటంజేసి వారికి నందఱకును ద్రౌపదియందు మోహము కలుగుటకును వారందఱు నామెను వివాహమాడ నిశ్చయించుటకును గారణ మైనది.

పంచేంద్రోపాఖ్యానముంబట్టి గూడ నిట్టి వాసనావిశేషము గానం బడుచున్నది. హరునాజ్ఞ ననుసరించి పంచేంద్రులును మనుష్యజన్మములను బొంది వారే పంచపాండవు లయిరి. అయినఁ బాండవులు వారి యంశజులని కూడ నున్నదని యెట్లంటిమా 'ఆత్మావై పుత్రనామాసి' అను వచనము వలన నట్టి సందేహమునకుఁ బనిలేదు.

పాండవు లేవురును ద్రౌపదిం జూచునప్పు డొక్కపెట్టున వారికి నందఱకును నామెయెడల మోహము కలిగెను. ఇది విధిప్రేరిత మనియు పరమార్థ మనియు వక్కాణింపఁబడినది. కావున జన్మాంతర వాసనా ప్రాబల్యము మనుష్యులబుద్ధులను త్రిప్పుచు వారి కార్యములకు హేతు భూతమై యుండుననుటకు నీ గ్రంథస్థాంశములు నిదర్శనము లగుచున్నవి. అట్టి జన్మాంతరజ్ఞానము లేకుండుటంజేసి యథార్థము తెలియక దైవికమనియు నదృష్టమనియు ననేకవిధముల జను లూహింపుదురుకాని

జన్మాంతర వాసనలును కర్మములును మనుష్య వ్యాపారములకు ముఖ్య కారణము లగుచున్న వనునది హిందూమత సిద్ధాంతము.

## (2) ఉపశ్రుతి.

మనదేశములో ప్రశ్నలఁ జూచుటయు వానింబట్టి భావి కార్య లాభాలాభములను నిర్దేశించుటయు నాచారము కలదు. ఈ విషయమున నాధునికులకు నమ్మకము తక్కువగుచున్నను అట్టి విశ్వాసము సర్వజన సామాన్యమై యున్నది. వేదమున నుపశ్రుతిఁ జూచు నాచార మున్నట్లును దాని ననుసరించి పాండవులు సజీవులై యుండిరనియు ద్రౌపదీ స్వయంవరము చాటించినయెడల వా రెక్కడ నున్నను తప్పక వచ్చెదరనియు ద్రుపదుని పురోహితుఁడు యాజుఁడు మిగుల నిశ్చయ బుద్ధితోఁ జెప్పెను. ఉపశ్రుతివిధానము వేదవిహితము గావున యాజుని మాటప్రకారము పాండవులు వచ్చుటయు ద్రుపదుని యభీష్టసిద్ధియుఁ జరిగెను.

ఇటులనే మనలోఁ ప్రశ్నలను చూచుటయుఁ బశుపక్ష్యాదుల గమన విశేషములచేతను బల్లిపతనము మొదలగు వానిచేతను ముందు కలుగఁ బోవు ఫలాఫలముల నిర్దేశించుటయు శకునములు చూచుటయు భుజములయు నేత్రములయు నదరుపాటుచేత భావిలాభాలాభముల నిర్ణయించుటయు స్వప్నములవలన ముందుకలుగు లాభనష్టముల నెఱుంగుటయు హిందూమతస్థులకు నాచారములై యున్నవి. అట్టి వానిలో నుపశ్రుతి యొకటి. దీనికి వేదమును శ్రీమహాభారతమును ప్రమాణములై యున్నవి. తక్కిన వానికిని రామాయణాద్యుత్తమ గ్రంధస్థములగు నిదర్శనము లనేకములు కలవు. మనవారిలోఁ జాల మందికిట్టి నమ్మక మిప్పటికిని కలదు.

ముహూర్తములు తిథివార నక్షత్రములు లగ్నబలము గ్రహకూటము మొదలగు వానినిబట్టి కాలముయొక్క శుభాశుభములు నిర్ణయించుచు తిథ్యాదుల మంచిచెడ్డలను జూచి నిర్ణయించు సమయము ముహూర్త మనఁబడును. పూర్వకాలమునుండియు సమస్త కార్యములకును ముహూర్తము

యుంచుట యనమతమువారి పద్ధ్మకములలో నొకటి. వేదవిహితములగు కర్మములకు మంచి ముహూర్తమును జూడవలెను. కావున వేదమునకు జ్యోతిష మంగమయ్యెను.

## (౩) దైవయోగము.

'దైవాధీనం జగత్సర్వ'మ్మను న్యాయమునకు ఈగ్రంథమందు నిదర్శనములు మెండుగఁ గలవు.

61. రాజ్యమదియు సుర్వ్వ•రాసుర విరహితుఁ
డయిన పతికిఁ గేస•లాభి జాత్య
శౌర్యమహిమ వడయు•సమకూఱు నయ్యు తా
పత్యనిత్యసత్య • భాషణుండ.

అనుటవలన దైవబలము ప్రధానమనియు నట్టి దైవబలమునకు పురోహితుఁ డుండవలెను కాన పురోహితుండు, లేనివానికి రాజ్యసంపద సమకూర దనియు తెలియుచున్నది. "దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతం। తన్మంత్రం బ్రాహ్మణాధీనం" అనుశ్లోకోక్తి నీపద్యము స్థిరపరచుచున్నది.

దుర్యోధనాదులు పాండవులను చంపుటకు నెంత ప్రయత్నించినను వారికి దైవబలం బుండుటచేత నే యిక్కట్లన్నియు దాటి క్షేమంబుగ నుభయ సంపదలం గనిరి. ద్రుపదుడు దేవతా ప్రసాదము వలన పొందిన కన్యకకు వరుఁడు కావలసిన యర్జునుఁడు మడసినట్లు సుప్రసిద్ధమయినను దేవనిశ్చితములగు కార్యము లప్రతిహతములు కావున పాండవు లపాయములేక యుండిరి.

భారతయుద్ధమును పాండవాదుల జన్మంబులును శ్రీకృష్ణుని యవతారమును ద్రౌపదికి నయిదుగురుభర్త లగుటయు మొదలగుకార్యములన్నియు దేవతలప్రేరణముచే జరుగుచుండినట్లు ఈకథయందు స్పష్టమగుచున్నది. కావున భూలోకమునందు జరుగుకార్యములకు దైవప్రేరణము

న్నట్లును 'దైవాధీనం జగత్సర్వ'మ్మను న్యాయము యథార్థమనియు నీగ్రంథ స్థాంశములవలన విశద మగుచున్నది.

## 4. ధర్మము.

ఆహారనిద్రాది వ్యాపారములు మనుష్యులకును పశుపక్ష్యాదులకును సమానను లని కనుచున్నారము. స్వోదరపోషణమును స్వసుఖాపేక్షయు కుటుంబాభిలాషయు మొదలగునవి సర్వజంతుసామాన్యములు. ఇట్లుండ మనుష్యులకును పశువులకును తారతమ్య మొకటియే యున్నది. మనుష్యులకు 'ఇది మంచిది' 'ఇది చెడ్డది' 'ఇది చేయతగినది' 'ఇది చేయఁగూడనిది' 'ఈపనిచేసిన పుణ్యము' 'అదిచేసిన పాపము' అనుజ్ఞానము కలదు. అట్టి భేదజ్ఞానముచేత వ్యాపారములు నిర్బంధింప నవసరము కలవారు మనుష్యులు. ఇదియే మనుష్యులు పశువులకంటె నధికు లగుటకుఁ గారణము. అట్లు ధర్మాధర్మములు మంచిచెడ్డలు పుణ్యపాపములు యుక్తాయుక్తములు తెలియుటయే జ్ఞాన మనఁబడుచున్నది. కావున జ్ఞానోపదేశము సర్వజనులకును నవసరము. అట్టి జ్ఞానములేక జనులు సంచరింతురేని వారికిని మనుష్యసంఘమునకును హాని కలుగును. కావుననే 'సర్వస్య ద్వే సుమతీ కుమతీ సంపదాపత్తిహేతూ' అని పెద్దలు వక్కాణించిరి. ధర్మము నవలంబించువారు మంచివారనియు నధర్మమార్గమున నుండువారు చెడ్డవారనియు లోకముచేత గణింపఁబడుదురు. ఇహమందు సుఖదుఃఖములకేకాక పరమందు కూడ సుగతిదుర్గతులకు నీరెండును కారణము లగుచున్నవి. కావున సర్వజనులును నట్టి ద్వంద్వముల నెఱింగి ధర్మము నవలంబించుచు నధర్మమును విడుచుచు సంచరించిన నిహపరసౌఖ్యముల నొందుదు రనునది హిందూమతసిద్ధాంతములలో నొకటి. అట్టి జ్ఞానోపదేశములు వేదమున బహుళముగ నున్నవి. ధర్మశాస్త్రములయందును పురాణములందును ఇతిహాసములందును కూడ నాధర్మములే తేటగవివరింపఁబడెను. కావుననే యాగ్రంథములన్నియు సద్గ్రంథము లని హిందువులు కొనియాడుదురు. శ్రీమహాభారతము అట్టిగ్రం

థములలో నొకటి. ఇందలి కథాపురుషులు ధర్మశీలురు; అధర్మభీరువులు వారివ్యాపారములను వివేచించిన ధర్మమే ద్యోత్యమగుచుండును. వ్యాసులు పాండవులను మొదట కనినప్పుడు వారికి ధర్మమార్గమును దప్పకుండుఁడని బోధించెను. అటులనే ద్రౌపదీవివాహవిషయమున ధర్మలోప మెక్కడ నగునో యని వార లందఱును భీతిచేత తల్లడిల్లి విచారణముచేసికాని నిర్ణయింప రైరి. ద్రౌపదియుఁబతింగూర్చి తపంబొనరింప శివుఁడు ప్రత్యక్షమై యామెకు జన్మాంతరమున నేగురు పతు లగుదురని వరమిచ్చునపు డది లోకాచార విరుద్ధముకావున నట్టివరమును పొంద లేనని వేడుట యామెధర్మబుద్ధికి నొక నిదర్శనము. కుంతికూడ నిటులనే భయపడెను. అర్జునుఁడు ద్రౌపదిని పాణిగ్రహణముచేయవలసియుండ నాతఁడు సోదరులలోఁ బెద్దవాఁడుండ చిన్నవాఁడు ముందు వివాహ మాడఁగూడదని నిశ్చయించుట మరియొక నిదర్శనము. కావున ధర్మముయొక్క ప్రాధాన్యమును బోధించుట యీగ్రంథముయొక్క ప్రయోజనములలో నొకటి యని గ్రహింపనైనది. అట్టి ధర్మోపదేశము లనంతముగ భారతమున నుండుటవలననే యది పంచమవేద మనుప్రసిద్ధి పొందెను.

---

## IV. బహుభర్తృకత్వము.

ఒక పురుషునకు పెక్కండ్రు భార్య లుండుట సర్వసామాన్యముగ గనుచున్నారము కాని యొక స్త్రీకి పెక్కండ్రు భర్తలగుట లోకాచార విరుద్ధమే. కాని దానికి ననేక సమాధానములు కలవు.

(1) తొలిజన్మమున నింద్రసేనయనంబరగి తనభర్తయగు మౌద్గల్యుని నేనురూపంబులఁ బొంది తన కోరికలం దీర్పుమని వేడిన వాసనాప్రాబల్యము.

(2) ఇంద్రసేన రెండవజన్మమున కాశీరాజు కూతురై పుట్టి తప మొనరించునప్పుడు ధర్మవాయువాసవాశ్వినులు వచ్చి దానిని తమ దేహాంశములకు దేహాంతరమునఁ బత్నిఁగా గోరిరి.

(3) ఈజన్మంబునఁజేసిన తపస్సునకు మెచ్చి యీశ్వరుఁడిచ్చినవరము.

(4) భీమార్జునులు భిక్షఁదెచ్చితి మని తల్లికి నివేదింప నామె మీ రేవు రు నుపయోగింపుఁ డనుట. కుంతి మహాపతివ్రతయగుటచేత నామె వాక్కు వ్యర్థము కాఁగూడదు. పాండవులు మాతృ భక్తిపరులు గాన వా రామె వాక్కున కన్యథాగ నడుపరు.

(5) పూర్వజన్మల వాసనాప్రాబల్యముచేత ద్రౌపదికి పాండవు లేవురయందును పాండవులేవురకును ద్రౌపదియందును దైవప్రేరితమై మోహ ము పుట్టెను. 'సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః' అని యున్నది గనుక శాస్త్రమునకును ఆచారమునకును విరో ధమయ్యును, ధర్మస్వరూపులయి ధర్మరతులయి యధర్మభీరువు లైనవారి యంతఃకరణప్రవృత్తియే ప్రమాణమై వా రొనరించినకార్యము నిర్దుష్ట మనుటకు హేతువు.

(6) ఇందులకు పూర్వాచారంబులు గూడ నున్నట్లు ధర్మజుఁడును వ్యాసులును గూడ దృష్టాంతముల నిచ్చిరి. అ ట్లొనరించినవారు మునులు ముని కన్యలు గాన నట్టి యాచారము సదాచార మన నొప్పును. 'సతాం=సా ధూనాం-అపగత కిల్బిషానాం య ఆచార స్సదాచారః' అను నిర్వచనమును బట్టి తప మొనరింపుచు పాపదూరులై ధర్మపరులై యుండు మునులచే నొనర్పఁబడినది శాస్త్ర విరుద్ధంబయ్యును సదాచారమని గ్రహింపఁదగినది. పాండవులును అట్టివారలే కావున వారికార్యము లనిందితము లని నిశ్చ యింపనైనది.

(7) తా మొనరించు కార్యములకు శాస్త్రము ఆచారము ఆప్తవచ నానుమతి అను నీ మూఁడును కనిపెట్టవలయు నని తెలియుచున్నది.

141. 'ధీరమతు లిట్లు నేసిన
వా రెవ్వరుఁ గలరె యాప్తవచనానుమతిన్'.

అనుటలో నాప్తుల యనుమత మేకార్యమునకును నవసరమని కన్పట్టును. ఆప్తులు వద్దని నిషేధించినఁ జేయకూడఁదనియు నూహింపవలసి యున్నది. ఈ విషయమున నైతంతువు లేవురుచు నజిత యనురాజకన్యకను స్వయంవరంబునఁ బడసి వివాహంబయి దానియందు వారు వేలువేల సంతానంబు వడసినట్లును అట్టి కులంబు సత్కులంబయ్యె ననుటవలన నట్టి వివాహము ఆప్తవచనానుమతి పొందినట్లును స్పష్టమగుచున్నది. ద్రౌపదిని పాండవు లేవురకును నిచ్చి వివాహము సేయుటకు వ్యాసులును కుంతియు ద్రుపదుఁడును ధృష్టద్యుమ్నుఁడును అనుకూలించి జరిపిరి. కాన నాప్తవచనానుమతి కూడ నొక ప్రమాణ మైనది.

---

## V. ఇతర విషయములు.

### (1) ద్రుపదుని కోరిక.

అర్జునునిచే నోడినపిదప ద్రుపదునకు నాతనియందుఁ బ్రేమకలిగెను. అట్టిప్రేమకు నంగారపర్ణునియందు కూడ నిదర్శన మగుపడుచున్నది. అర్జునునిచే నోడియు నంగారపర్ణుఁ డాతనితో సఖ్యముచేసి పాండవులకు నుపకారి యయ్యెను. ఇట్లు శత్రువులయెడల నయినను ప్రేమచూపుట సాత్వికుల లక్షణము. ఇట్టి సాత్వికలక్షణము ద్రుపదునియం దుండుటచేత నతనికి నర్జునునియెడల ప్రీతి కలుగుటకును అర్జునునకు దేవి కాఁదగినకొమార్తెను బడయవలయు నను కోరిక పుట్టుటకును కారణ మైనది. అందులకు విశ్వప్రయత్నముచేసి ద్రౌపదిని నగ్నిదేవతాప్రసాదమునఁ బడసెను.

దుర్యోధనుని దుర్మార్గమువలన పాండవులు లక్కయింట దహింపఁబడినట్లు లోకవిదితమై ద్రుపదునకుఁ దెలిసినపు డాతఁ డెంతేని దుఃఖించెను. కాని దైవ వశమున వారా ప్రమాదమును దప్పించుకొని బ్రతికి ప్రచ్ఛన్నవేషధారు లయి విప్రవేషమునుండి తుదకు ద్రౌపదీ స్వయంవర

ముహూర్తమునకు కాంపిల్యనగరముఁ జేరి మత్స్యయంత్రభేదన మొనరించి ద్రుపదునియభీష్టముఁ దీర్చినవారైరి.

కాని ద్రుపదునకు మత్స్యయంత్రభేదనము చేసినవా రెవరో తెలియక మిగుల వ్యసనపడి వారి నిజరూపుఁ గనుగొనుటకు ననేకప్రయత్నములు చేసెను. ధృష్టద్యుమ్నునిచే వారి వ్యాపారాదులను గ్రహించి వార లుత్తమక్షత్త్రియులు బ్రాహ్మణులు నగుదురు కాని హీనజాతులవారు కారని తెలిసికొనెను. ధృష్టద్యుమ్నుఁడు కనిపెట్టిన విషయములలో నొకటి లోపము కనబట్టుచున్నది. శ్రీకృష్ణబలరాములు వచ్చి పాండవులం గని వారితో సంభాషించిన విషయము నాతఁడు కనిపెట్టినట్లు గ్రంథమునకనబట్టుచున్నది. ఇది సహేతుకముగ లేదు. ఈ సమాచారము తెలిసినయెడ వారి నిజరూపు తెలియుటకుఁ గొంత యాధారము కలుగును.

పురోహితునితో ధర్మరాజు 'మీ రాజు మనోరథంబు సఫలం బయ్యె వగవనేల' యనుటవలనఁ దమ నిజరూపు సూచింపఁబడినను అది శ్లేషవాక్యమై ద్రుపదాదులకు నర్థము కాలేదు. పాండవులకు నిట్టి గూఢవర్తనమునందుఁ గల ప్రావీణ్యము ముందు వారికి కలుగఁబోవు నజ్ఞాతవాసమునకు సహకారి యయ్యెను.

## (2) పూర్వకాలపు లక్షణములు.

సదాచారములు:—ఈ గ్రంథమువలన పూర్వకాలపు టాచారములు కొన్ని తెలియుచున్నవి. అభ్యాగతులను బూజించుట మనదేశమున నాచారమై యున్నది. 'అభ్యాగత స్స్వయం విష్ణుః' అను వాక్యమువలన నట్టివారిని పూజించుట శాస్త్రిచోదితమును సదాచారమును అని గ్రహింపనగును. భిక్షుమెత్తినను నతిథులకును బీదలకును నన్నం బిడుట పూర్వకాలమునుండియు సదాచారముగ మనదేశమున నవలంబింపఁబడుచున్నది.

పెద్దలఁ గనిన వారికి నమస్కరించి పూజించుటయుఁ బిన్నలను గౌగిలించుకొనుటయుఁ గుశల ప్రశ్నంబులు చేయుటయు వారికి నర్ఘ్య ప్రాద్యాసనాద్యుపచారంబుల చేయుటయుఁ బూర్వమునఁగూడ నుండి నట్లు కనఁబడుచున్నది.

స్త్రీల నడవళ్లు:—ఈ విషయమున గ్రహింపఁదగిన యంశములు కొన్ని గలవు. పాండవులు ద్రుపదునియింటికిఁ బోవునపుడు కుంతిని ద్రౌపదిని నొక వేఱు రథంబునఁ గూర్చుండఁబెట్టిరి. అట్టియెడము పూర్వమునను స్త్రీపురుషులు నిలిపెడివారు. పూర్వము రాణివాస మున్నది యున్నట్లు గానరాదు. ద్రౌపది సభలోనికి వచ్చినట్లు స్పష్టము. కోడండ్ర చేత నత్తలు పనులఁ జేయించుటయుఁ గోడండ్రు నత్తలయెడ గౌరవము కలిగి వారికి నాజ్ఞావర్తినులయి యుండుటయుఁ గనఁబడుచున్నది.

(3) బ్రాహ్మణులు:—పూర్వకాలమున బ్రాహ్మణులు మూఁడు తెఱంగుల నుండినట్లు కనఁబడుచున్నది. కొందఱు అడవులలోనుండి తపము చేయుచు ధనమునం దాశవదలి కందమూలాదికములఁ దినుచు శిలోంఛవృత్తి పరు లయి యదృచ్ఛాలాభసంతుష్టు లయి ఇహలోకసంబంధంబు లగు దేహ సౌఖ్యంబులఁ దృణీకరించి పరలోకసుఖమే ప్రధాన మనిరొంచి తమ కాలము గడపుచుండువారు. వీరికి నప్రతిగ్రహము ఒక నియమము. వీరలు వర్ణాశ్రమ ధర్మంబుల జరుపుచు నెల్లప్పుడును వ్రతములు నేయుచు పంచ మహాయజ్ఞంబుల నొనరించుచు నుండుదురు. వీర లుత్తమ బ్రాహ్మణు లనఁదగుదురు. వీరిలో నగ్రగణ్యుఁ డుపయాజుఁడు. వారివలెనే బ్రాహ్మణాచారంబు లన్నిటిని జరుపుకొనుచు తపం బాచరించుచు ఫలాపేక్ష కలిగి పౌరోహిత్యాదుల నపేక్షించువారు కూడ నుండువారు. వారు మధ్యము లనదగుదురు. ఇట్టివారిలో నొకఁడు యాజుఁడు. తక్కినవారు సామాన్యముగ కుటుంబ భారమును వహించి దేశాటనమును చేయుచు ద్రవ్యార్జనపరు లయి యుండువారు. వీరివలన దేశవృత్తాంతములును రాజకీయ వ్యాపారము

లును జాటఁబడుచుండును. వీరును రాజులచేఁ బూజింపంబడుచు నందఱ చేతను గౌరవింపబడుచు నుండువారు.

105 'ఏమి దోషంబు సేసియు బ్రాహ్మణుండు వధ్యుండు గాఁడు. మనరాజ్యంబును నర్థంబును బ్రాహ్మణార్థంబ' అని రాజు లందఱు నను టయుఁ గర్ణుఁడు బ్రాహ్మణతేజం బజేయం బని విజయుతోడ యుద్ధంబు సేయనొల్లక క్రమ్మఱుటయు నప్పటికాలమున బ్రాహ్మణులయెడ రాజు లకుఁ గల గౌరవము వ్యక్తపరచుచున్నది.

(4) రాజులు:—పూర్వకాలమున రాజులకుఁ బురోహితస్వీకారము మిగుల నవశ్య మనుమాట కనఁబడుచున్నది. పురోహితుఁ డుండిన రాజు నకు నిహపర సౌఖ్యంబులు రెండును సమకూరు నని యున్నది. పురోహి తుఁడు రాజు యొక్క సేమమును గోరి వేదవిహితములగు కర్మల నాచ రింపఁజేయుచు దేవతాప్రసాదసాధనములగు వ్రతాదులు చేయించియు ధర్మమార్గమును తెలుపుచును ధర్మమార్గ ప్రవర్తకులుగ జేయుచును నధర్మ మార్గములనుండి దొలగించుచును రాజునకు గురువులై యిహమున యశోబల సంపన్నులంజేసి పరలోకమున నుత్తమగతులు గలవారిగఁ జేయుదురు. దైవబలమునకు నగ్ని ప్రధానము. అగ్నిహోత్రమున వ్రేల్చిన హవిర్భాగములు దేవతలకుఁ జెంది వారికి సంతుష్టినిఁ గలుగజేయును. "దైవాధీనం జగత్సర్వ" మ్మను వచనమునుబట్టి దేవతాప్రీతి జనుల కత్యవసర మనునది నిశ్చయము కావున నట్టి దేవతాసంతుష్టికి నగ్నిపరిగ్రహము రాజులకు విహితమై నది. అట్టి కార్యములందు రాజులకు సహకారి కాఁదగిన పురోహితుఁడు వేదవేదాంగవిశారదుఁడును జపహోమయజ్ఞ విధుల నెఱింగినవాఁడును, సత్యవంతుఁడును ధర్మార్థ కామ మోక్షముల సంపాదించుటకు సాధన భూతుఁ డగుటకు సమర్థుండును సదాచార సంపన్నుఁడును పెద్దలచేత గౌరవమును పొందఁదగినవాఁడును దోషరహితుఁడును తపోశీలుఁడును పవిత్ర మగుచరిత్ర కలవాఁడునుగా నుండవలెను. ఇట్టి కారణములచేత రాజులకు పురోహితస్వీకార మవశ్య మని యంగారపర్ణుఁడు బోధించెను.

(5) ఉత్సవములు:—గొప్ప యుత్సవములు జరుగునపుడు పూర్వ కాలమున ననఁగ నిప్పటికి నయిదువేలేండ్లకుఁ బూర్వము చేయఁబడు నేర్పాటులు చూడ నప్పటి నాగరికతాలక్షణము లాశ్చర్యమును పుట్టిం చును. ఇప్పటి కాలమున మనము గనుచున్న నాగరకమునకు నప్పటి కాలము తీసిపోదని కనుపట్టుచున్నది. వానిలోఁ గొన్ని వర్ణనములు 'చంద నోదక సంసిక్త' 'ప్రాంగణ రంగవల్లీకృత కర్పూర మౌక్తిక ప్రకరంబు లను' మొదలగునవి అతిశయోక్తులుగ నెంచఁదగును. ఇట్టి యతిశయోక్తు లగు వర్ణనములు మన గ్రంథములయందు నొక వింతకాదు.

---

## VI. సంస్కృత గ్రంథమునకును తెనుఁగు గ్రంథమునకును గల సాదృశ్య వ్యత్యాసములు.

నన్నయభట్టు సంస్కృత భారతమును తెనిగించుటలో చాలభా గము మూలగ్రంథము ననుసరించియే రచియించెను. కాని యానియమమును పూర్తిగ పాటింపక తన యిచ్ఛానుసారము కొన్ని మార్పులుకూడ చేయుచుఁ దన కవితాపాటవమును కనఁబఱచుచుఁ గథాసౌష్ఠవమునుగూడ వృద్ధిపఱ చెను. వర్ణనాభాగములు తఱచుగ మూలమునకు సరిపడియే యున్నవి. కథా భాగమునఁ గొన్ని విషయములను విడిచియు గొన్నింటిని మార్చియు మఱి కొన్ని విశేషములను చేర్చియు రచించెను. అట్టి సాదృశ్య వ్యత్యాసము లలో ముఖ్యములగువానిని గొన్నింటిని నిందు పేర్కొననైనది. *

---

* సంస్కృతభారతప్రతు లన్నియు నొకరీతిగలేక ననేకభేదము లున్నట్టుకనుచున్నారము. అధ్యాయములు శ్లోకములుకూడ న్యూనాధికముగ నున్నట్లు తెలియవచ్చుచున్నది. చెన్నపురిలో ప్రజోత్పత్తి సంవత్సరమున ముద్రింపఁబడినప్రతి నాయొద్ద నున్నది. దీనికిని కుంభకోణమున ప్రచురింపఁ బడినదానికిని ఇట్టివ్యత్యాస మధికముగ నున్నట్లు తెలియవచ్చుచున్నది. కా

5-వ పద్యము:—(1) ద్రోణుని వృత్తాంతముఁ దెలుపుటలో సంస్కృతమున ఘృతాచీ వృత్తాంతములోనగు ద్రోణుని జన్మరీతియంతయు విశదపఱపఁబడెను. తెలుఁగున నది విడువఁబడెను. (2) ద్రోణుఁడ స్త్రవిద్యను పరశురాముని వలన గ్రహించిన విషయము సంస్కృతమున నున్నది. తెలుఁగున లేదు. (3) అగ్నివేశుల ప్రశంస సంస్కృతమున లేదు.

8-17-22-24. ద్రుపదుఁడు అర్జునునకు దేవి కాఁదగిన కూతునిఁబడఁ గోరినట్లు తెలుఁగున నున్నది. ఈవిషయము సంస్కృతమున లేదు. ఇట్టి విశేషమును వేయుట కథాసందర్భమునకు సొబగును కలుగఁజేయుచున్నది. ద్రౌపదిని గురించిన యభీష్టమును ప్రయత్నమును స్ఫుటము కాకున్న 17-వ పద్యమున యాజుఁడు 'నీకోర్కికిం దగినయట్లు కొడుకును గూతురుం బుట్టుదు'రను టకును 22-వ పద్యాంశమగు ద్రుపదుని విషాదమునకును 24-వ పద్యాంశమగు స్వయంవర ప్రయత్నమునకును హేతువు లుండవు. ఇది యంతయుఁ గథా సందర్భమున కనుకూలముగనే యున్నది.

16. ద్రోణుని సామర్థ్యము వర్ణించుటలో సంస్కృతమున 'షడరత్నిధనుశ్చాస్య' అని యున్నది. తెలుగునను నీయంశమే 'షడరత్ని ధనుర్ధరుఁడ'ని వర్ణింపఁబడినది.

17. (1). ద్రుపదుని భార్య 'సౌత్రామణియైన కోకిలాదేవి' యని తెలుఁగున నున్నది. సంస్కృతగ్రంథమున నిట్టి నామ నిరూపణము లేదు.

---

పునసరియైన పూర్తియగు సంస్కృతప్రతి యిదియని నిర్ధారణ చేయుటకు అవకాశము లేకున్నది. నన్నయ్య ఏమూలప్రతి ననుసరించి తెలిఁగించెనో అందలి యధ్యాయములు శ్లోకములు నేవి యెక్కువగానున్నవో దురవగాహము. గాన నాయొద్ద నున్న చెన్నపురిప్రతి ననుసరించి కనఁబడిన వ్యత్యాసముల నుదాహరించుచున్నాను. వానిలోఁ గొన్నింటి నిజానిజములు సందేహాస్పదము లని నానమ్మకము గాననట్టి లోపములను చదువరులు మన్నింతురుగాక యని తలంచెదను.

(2) యాజుఁడు 'నీకోర్కికిం దగిన యట్టి కొడుకునుం గూతురుం బుట్టుదు రోడకుండుము' అనుట 8-వ పద్యాంశమునకు సరిపడి యున్నది.

20. (1) ద్రౌపదీ జననకాలమున నాకాశ వాణి కొన్నిమాటల పలికినట్లు సంస్కృతమున నున్నది. ఈచిన్నదాని మూలమున కౌరవులకుమ హద్భయము కలుగుననియు క్షత్రియులకు నాశము కలుగుననియు పలికెను. ఈమాటలు తెలుఁగున విడువఁబడెను. ఇట్లు విడుచుట వలనఁ గథకు సౌష్ఠవ మే కలిగినది. బ్రాహ్మణుఁడు ద్రౌపదిని గూర్చి పాండవులతోఁ జెప్పిన మాటలలో నీసంగతిఁ గూడ చెప్పిన వారికి నా చిన్నదానియందు తప్పక విముఖత కలుగును. దానివలన భావికార్యమునకు భంగము కలుగును. కావున నీవిషయమును విడుచుటవలనఁ గథకు వన్నెవచ్చిన దనదగును. (2) ద్రౌప దిని వర్ణించుటలో సంస్కృతమున నున్న 'నీలోత్పలసమోగంధో' 'పద్మప లాశాక్షి' మొదలగు వర్ణనాంశములకు సరిగనే తెలుఁగున నున్నవి.

22. 23. 24. ఈపద్యాంశమగు ద్రుపదుని విషాదమును స్వయంవర ప్రకటనమును ఇట్టి పూర్వోత్తర సందర్భములు సంస్కృతమునఁ గానరావు. ఇది యంతయు 8-17 పద్యములలోని విషయములకు సరిపడి యున్నది.

25. ద్రుపదుఁడు స్వయంవరముహూర్తము నిశ్చయించుటలోఁ దెలు గులో మాస తిథి నక్షత్రములు నిర్దేశించిన ట్లున్నది. సంస్కృతమున నిది లేదు. ఈ విషయము నందలి యసంగతము వెనుక విమర్శింపఁబడినది. కాన నాభాగముఁ జూడనగును.

92. కర్ణుఁడు మత్స్యయంత్ర భేదనమునకు సమకట్టినట్టును చేత కాక మరలినట్లును తెలుఁగున నున్నది. సంస్కృతగ్రంథమునఁ గర్ణుఁడు విం టిని సమీపించి నపుడు ద్రౌపది యతఁడు సూతుఁడుగాన నతని వరియింప నని బిగ్గరగా పలుక నాతఁడు మరలిన ట్లున్నది. ఈవ్యత్యాసము ననుసరించి కొన్ని యంశములు గుర్తింపవలసి యున్నవి. ధృష్టద్యుమ్నుఁడు రాజలోక మును వక్కాణించి చూపుచు వారిలోను బ్రాహ్మణులలోను మత్స్యయంf

త్రమును కొట్టిన యాతఁడు ద్రౌపదికి పతియగు నని పలికెను. అప్పుడు కర్ణుని కూడ చూపెను. ధృష్టద్యుమ్నునకు కర్ణుని జాతివిషయము తెలియకుండునా తెలిసియు నతని జూపెనా యనుభాగము విచార్యము. ద్రౌపదికిఁ దెలిసిన యంశము ధృష్టద్యుమ్నునకుమాత్రము తెలియ దనుటకు వీలులేదు. తెలిసియు నేల యాతని చూపెనంటిమా యొక కారణము కనఁబడుచున్నది. దుర్యోధనుఁడు రారాజు. కర్ణుఁ డాతనికి నత్యంత సఖుఁడై యతని సన్మానంబు వడసినవాఁడు. కావున బహిరంగముగ నిండు సభలో నాతని లాఘవపఱచుట యనుచితమనియు ట్లొనరించె నని యూహింపనగును. పరనిశ్చయమున కన్యకాస్వాతంత్ర్యము నెవ్వరును పాటింపక తప్పదు కాన నామె నిశ్చయము నిర్బాధకమని యెంచి యట్లుగా వారలేర్పఱచికొనినట్లు కనఁబడుచున్నది.

ఈ వృత్తాంతమును కేవలము విడిచి కర్ణుఁడుకూడ ప్రయత్నించినట్లును గొనయం బెక్కించలేక నిరాశఁజెంది చనినట్లును తెలుఁగున నున్నది. ఇది సంస్కృతమునగల విరోధమును తొలగించుటయే కాక యర్జుననకు నుత్కృష్టతయు నాతనికి ప్రతిపిరుఁడగు కర్ణుని వైరస్యమును స్థిరపఱచుచున్నది. కావున నీమార్పు సొబగునకుఁ గారణ మైనదనవచ్చును.

94-95. బ్రాహ్మణులు తమ మధ్యమువనుండి యర్జునుఁడు లేచినపుడు వా రాతని శ్లాఘించుటలో పూర్వము పరశురాముఁడు బ్రాహ్మణుఁడయ్యు రాజులను చంపలేదా యనియు నగస్త్యులు సముద్రోదకమును పానముచేయ లేదా యనియు నుపమానములఁ జెప్పినట్లు సంస్కృతమున నున్నది. ఈ యుపమానములు తెలుఁగున విడువఁబడినవి. అవి యుండఁదగినవి.

96. అర్జునుఁడు ధనుస్సమీపమునకుఁ బోయి శ్రీకృష్ణుని శివుని ధ్యానించినట్లు సంస్కృతమున నున్నది. ఇవి తెలుగున విడువఁ బడినవి.

107. భీముఁడు చెట్టు పెఱికి దానిని ధరించినట్లు మాత్రము తెలుఁగున నున్నది. దాని యాకుల నూడ్చి నట్లును అట్టి భీమునకు గజేంద్రునితో పోలికయు సంస్కృతమున నున్నది. తెలుఁగున నది లేదు.

133. శ్రీకృష్ణులవారు పాండవులను కలిసికొనునప్పుడు ధర్మరాజు ప్రశ్నకు నుత్తరమిచ్చుటలో వారిని సూర్యునితోఁ బోల్చినట్లు వర్ణించిన యంశమును అచ్చటి యుపమాలంకారమును మిగుల నందముగా నున్నవి.

169. ద్రౌపదియొక్క పూర్వజన్మవృత్తాంతమును వివరించుటలో నామె తొలిజన్మమున నాలాయనియైన యింద్రసేనయని తెలుఁగున నున్నది. ఇట్టి నామనిర్దేశము సంస్కృతమునందు కానరాదు. ఇట్లు నామనిర్దేశము నన్నయ యెట్లు చేయకలిగెనో అట్టి గాధ కాధారమేమో యాలోచనీయము.

194. ద్రౌపదీపాణిగ్రహణముహూర్తసమయమున చంద్రుఁడు పుష్యమీనక్షత్ర యుక్తుఁడై యున్నట్లు సంస్కృతమున నున్నది. రోహిణియం దున్నట్లు తెలుగున నున్నది.

195. ద్రౌపదీ వివాహమునకు పురాలంకారవర్ణనమును వివాహమంటపాలంకార వర్ణనమును తెలుఁగుననున్నవి. సంస్కృతమున లేవు. ఇవి నన్నయకల్పితములు. అతని స్వానుభవ సిద్ధములగు విషయములు చేర్చి వర్ణించినట్లు కనఁబడును. పోకచెట్లు అరటిచెట్లు స్తంభములుగ రచించి రనునది గోదావరీతీరమున కోనసీమవారి యాచారముకాన నన్నయ యట్టి వర్ణనముచేసి యుండు నని యూహింప నగును. పోకలు పాంచాలదేశముననున్నట్లు కనఁబడదు. దీనివలన నన్నయ కోనసీమ వాఁడనియు నందును వేగినాఁటివాఁడనియుఁ గొందఱి మతమున్నది కావున నతఁడు ముంగండవాసి యని యూహింపవచ్చును.

• వివాహాంతమున ద్రౌపది కుంతికి నమస్కరించినట్లును కుంతిద్రౌపది నాశీర్వదించినట్లును సంస్కృతమున నున్నది. తెలుఁగున నీభాగము లేదు.

---

*

# లక్షణము.

గ్రంథరచనమునందలి కవితా విశేషములఁ దెలియజేయు నిబంధనలు లక్షణ మనబడును. అట్టిలక్షణమును తెలుపు శాస్త్రములు మనలో ననేక ములు కలవు. శ్రీమహాభారతము లక్షణశాస్త్రసిద్ధాంతముల ననుసరించి యుండుటచేత నది లక్ష్యగ్రంథమని మనవారందఱును పాటించుచున్నారు. కావున నట్టి విమర్శనముకూడ నవసరమని యెంచి యీద్రౌపదీ స్వయంవ రముయొక్క లక్ష్యవిశేషంబుల పరిశీలింపనైనది. ఇట్టివిమర్శనము గ్రంథపఠ నమునకు ముఖ్యమనఁ దగును.

ఇందు మొదట జ్ఞాపకముంచుకొన వలసిన విషయములు రెండు. ద్రౌపదీస్వయంవరము శ్రీ మహాభారతము నాదిపర్వములో నొకభాగ మని యును ఈమహాభారతమును స్వతంత్రరచితముకాక వ్యాసులు సంస్కృత మున రచించిన శ్రీ మహాభారతమునకు నాంధ్రీకరణమనియును దెలిసికొన వలయును. ఈ రెండు హేతువులఁబట్టి యీద్రౌపదీస్వయంవరమను నొక భాగమునకు లక్షణ విమర్శనముఁజేయఁ బూనుట యనవసరఁమని తోచును. కాని యట్టి సంశయమునకు సమాధానము కలదు. శ్రీ మహాభారతము సం స్కృతమున 125000 సంఖ్యగల పెద్దగ్రంథము. అందలియంశము లనేక ములు. నిజముగ చూచిన నదియొక వాఙ్మయ మనఁదగియున్నది. కావున నం దలి యంశములలో నొక్కొక్కటియ స్వతంత్రగ్రంథ మనఁదగినవి వేనవేలు న్నవి. అందలి యితిహాసము లనంతములు. కావుననే శ్రీ మహాభారతమొక యితిహాసమని పేరువడసెను. దానిలో నొక్కొక్కటి యొక గ్రంథరాజ మనఁదగును. సావిత్రీచరిత్రము, నలచరిత్రము, శ్రీరామచరిత్రము, వసిష్ఠా ర్ష్యోపాఖ్యానము, తపతీ సంవరణో పాఖ్యానము, మొదలగునుపకథలనేకము లందున్నవి. ఇంకను ధర్మబోధకము లగుభాగములు విదురనీతులు రాజధ

ర్మములు పతివ్రతా ధర్మములు మొదలగునవి యనేకములు కలవు. ఇట్టి భాగములను విడఁదీసిన నవియు వేర్వేరు గ్రంథము లనఁదగి యుండును. కావున శ్రీమహాభారతమొక వాఙ్మయ మనుటకు సంశయము లేదు. అట్టి విషయములో నందలిభాగము నొకదానిని తీసి రచించునపు డందలి లక్షణ విశేషంబుల పరిశీలించుట యనవసర మనుశంక పరిహరించి యీద్రౌపదీ స్వయంవరమునందలి లక్ష్యవిశేషంబుల విమర్శింపనైనది.

గ్రంథమునందలి లక్షణ విశేషములు శాబ్దిక ఆర్థిక నాయక గ్రాంథికము లని నాలుగువిధములుగ నుండును. గ్రంథవిభవము శబ్దశబ్దార్థమయమై కథా కథానాయకులవిశేషంబులచే నొప్పారియుండును. కనుక నాభాగము లన్నియు విమర్శనీయములు. ఇందుకొన్ని శాబ్దికార్థిక విషయములు వెనుక విశేషములలో విచారింపఁబడినవి. అయినను కవితా సందర్భమున గుర్తింపఁదగిన సామాన్యధర్మములు మఱికొన్ని కలవు.

మాటలను పురస్కరించికొనిన లక్షణము శాబ్దికమనియు నర్థమును పురస్కరించుకొనిన దానిని యార్థికమనియుఁ గథానాయకుని పురస్కరించుకొనిన దానిని నాయకలక్షణమనియు మొత్తముగ గ్రంథమును పురస్కరించుకొనినదానిని గ్రాంథికమనియును ననఁదగును. ఇందు శాబ్దికమన * స్వరప్రయుక్త మని గ్రహింపనగును. కాని శబ్దశబ్దార్థములు అవినాభావసంబంధులు కాన వానిని విడదీయకయే వాని లక్షణముల విమర్శింపవలసి యున్నది. ఈవిషయమున లాక్షణికులు కొన్ని నిర్ణయములను చేసియున్నారు. కావ్య మనునది

అదోషౌ సగుణౌ సాలంకారౌ

అనగా దోషములు లేనిదియు గుణములు కలదియు నలంకారములు కలదియుగా నుండవలెను. కావ్యదోషము లెవ్వియనిన:—

పదములతోసంబంధించినవి—పరుషము, అశ్లీలము, నిరర్థకము, సందిగ్ధము, క్లిష్టము, గూఢార్థము, గ్రామ్యము మొదలగునవి. అనఁగా కఠినముగఁ

---

*స్వరము = Sound.

బలుకుపదము లుండఁగూడదు. అమంగళము లగునట్టియు, సిగ్గును పుట్టించు నట్టియు, మనస్సునకు జుగుప్సఁ బుట్టించునట్టియు మాటలుండఁగూడదు. అర్థములేని మాటలుఅనఁగా పాదపూరణము కొఱకు వ్యర్థము లగుమాటల నుపయోగింపఁగూడదు. సందిగ్ధముగ నర్థమిచ్చునట్టియు స్ఫుటముగ నర్థము కానట్టియు గ్రామ్యము లగునట్టియు పదము లుండఁగూడదు.

వాక్యములతో సంబంధించినవి:—శబ్దహీనము, క్రమభ్రష్టము, విసంధి, పునరుక్తి, యతిభ్రష్టము, అధికపదము మొదలైనవి. అనఁగా వాక్యమున మాటలోపించుట, పదములు వరుసతప్పుట, సంధిలేకుండుట, ఒక యర్థమునిచ్చు మాటలు రెండుమారు లుపయోగించుట యతిచెడుట యనవసరమగు పదము లుండుట ఇట్టివికూడదు.

అర్థముతో సంబంధించినవి:—అపార్థము, సంశయము, పరుషము, విరసము, హీనోపమము, అధికోపమము, అప్రసిద్ధోపమము, హేతుశూన్యము, అశ్లీలము, మొదలగునవి. అనఁగా కూడని యర్థమిచ్చుట, సంశయార్థము, పరుషార్థము, విరసము, తక్కువ దానితో నుపమించుట ఎక్కువ దానితో నుపమించుట, లోకప్రసిద్ధము కానియుపమానము, హేతువు లేకుండుట, అశ్లీలము, ఇటువంటివి యుండఁ గూడదు,

ఇటువంటి దోషములు భారతమున వెదకినను కనఁబడవు కనుకనే యాగ్రంథము లక్ష్య గ్రంథ మనుప్రసిద్ధిఁబొందెను.

కావ్యశోభకు దోషములు లేకుండుటయే చాలదు. కొన్నిగుణములును నలంకారములును అవసరము. పురుషులకుగాని స్త్రీలకుఁగాని భుజకీర్తులు హారములు మొదలగునవి యెట్లు శోభస్కరములగునో అటులనే కావ్యములకు నలంకారములు శోభావహములగును.

యో హేతుః కావ్యశోభాయా స్సోలంకారః ప్రకీర్త్యతే
గుణోపి తాదృశో జ్ఞేయో దోష స్స్యా త్తద్విపర్యయః॥

అనఁగా కావ్యముల శోభకు నలంకారములు కారణము లగుచున్నవి. గుణములు కూడ నలంకారప్రాయముగనే యెంచఁదగినవి. గుణము లెవ్వి యనిన:—

మాధుర్యం, సుకుమారత, కాంతి, ఉదాత్తత, ఓజస్సు, ప్రేయము, గాంభీర్యము మొదలగునవి.

మాధుర్య మనఁగా మాటలు విడివిడిగ నుండి యర్థసౌలభ్యము కలిగి యుండుట. దీనికి నుదాహరణములు గ్రంథమం దంతట నున్నవి. అయిననునొక్క యుదాహరణ మీయ నైనది.

47. అనిన నరుఁడువల్లె•యని వాని కనియెగం
ధర్వ నిన్నుఁ గరుణ•ధర్మరాజు
గురుకులేశ్వరుం డ•శరణశరణ్యుండు
విడువఁ బంచెనింక•వెఱవకుండు.

సుకుమారతయనఁగా మృదువులగునక్షరముల కూడిక. శ్రుతికిమృదువుగి నుండుటకు సాధనములు మూఁడుకలవు. పూర్ణానుస్వారములు సరళవర్ణములు అనునాసికములగు ఙ ఞ ణ నమలు, అంతస్థములగు య ర ల వ లు తరచుగ నుండిన చెవుల కింపుగ నుండును. నన్నయ కవిత్వమందంతటను పూర్ణానుస్వారములును సరళవర్ణములును మెండు. కావున నతని కవిత్వమున సుకుమార గుణము కలదు. ఉదాహరణము—

101 వ. అత్యవసరంబున ధర్మనందనుండు నకుల సహదేవానుగమ్య మానుండయి నిజనివాసంబునకుంజనియె నిట ధృష్టద్యుమ్నయుతుండయి యజ్ఞసేనుండు మహాసేనతో నర్జుననకు సహాయుండయి నిలిచె నంత (దీనిలో పూర్ణానుస్వారములును మృదువర్ణములును మెండుగ నున్నవి)

కాంతి:—అత్యుజ్జ్వలత్వము కాంతి యనఁబడును. దీనికి నుదాహరణము.

185. మ. అమితస్థావర జంగమంబయిన బ్రహ్మాండంబు దానెంతయున్
మమతాగోచర మీ త్రిలోకములు నస్మద్బాహువజ్రానుపా
ల్యము లే నింద్రుఁడ నట్టినన్నుఁ గనుఁ గ్ర్రీడన్ జూదమాడంగ ను
త్తమ సింహాసన మెక్కి నీకు జను నే గర్వించి నాముందరన్.

ఉదాత్తత;—మెరుగులగు విశేషణముల నుపయోగించుట. ఉదా:-

129. శా. రాజత్కీర్తులు వచ్చి కాంచి రనఘుల్ • రాముండు కృష్ణుండున।
య్యాజామీఢు నజాతశత్రు నృపలో • కారాధ్యు నుద్యద్గుణ।
భ్రాజిష్ణుం దమమేనయత్తకొడుకున్ • బాలార్కతుల్యోజ్జ్వల।
త్తేజున్ భ్రాతృచతుష్కమధ్యగతుఁ గాంతే•యాగ్రజున్ ధర్మజున్॥

ఓజస్సు:—సమాసములు మెండుగ నుండుట - ఉదా.

190. ఉ. చారుమణిప్రభాపటలజాల విచిత్రకిరీటమాలికా
భారములన్ సముద్యదినపావకవర్ణములన్ సువర్ణకే
యూరవిభూషణావళుల......

ప్రేయస్సు. ప్రియసూచకములగు వాక్యప్రయోగము:—ఉదా:—

98 క. నిమిషాంతరముననిట్లు
క్రమమున మర్త్యులకు నేయ•సమకూలునె యు
త్తముఁ డీతఁడు బ్రాహ్మణ రూ
పమున సురేశ్వరుఁడొ హరుఁడొ•భానుఁడొ గుహుఁడో

గాంభీర్యము-గంభీరములగు వాక్కులుండుట. ఉదా:—

146. క. బలహీనుఁ డైనవానికి
నలవియె మోపెట్టి తివియ నక్కార్ముకముఁ
గులహీనున కకృతాస్త్రుని
కలవియె యాలక్ష్యమేయ నశ్రమ లీలన్.

## అలంకారములు.

కావ్యశోభకు నలంకారములు ప్రధానము లని మీఁద వివరింపఁ బడి నది. అవి శబ్దప్రయుక్తములు అర్థప్రయుక్తములు నని రెండు విధములు. శబ్దాలంకారము లగు ననుప్రాసములు ముక్తపదగ్రస్తములు మొదలగునవి శ్రుతి హితవును కలుగజేయును. అవి నన్నయకవిత్వమునఁ దక్కువగ నుండును. ఉపమానము, రూపకము, ఉత్ప్రేక్ష, అర్థాంతరన్యాసము, దృష్టాంతము మొదలగు నవి యర్థాలంకారములు. ఇవి విషయప్రకరణమున నాయాపద్యము లందుఁ గొన్ని సూచింపఁబడెను. మిగిలినవియు గ్రహింపనగును.

## శైలీలక్షణము

గ్రంథశైలియందలి విశేషములు వృత్తి రీతి శయ్య పాకము అని నాలుగు విధములుగ నుండును.

వృత్తి:—కథా సందర్భమునకును రసమునకును అనుకూలమగు శబ్ద రచనము వృత్తి యనఁబడును. రసములు తొమ్మిది:—శృంగారము వీరత్వము కరుణ హాస్యము భయానకము భీభత్సము రౌద్రము శాంతము. ఇట్టి రస ములకు ననుకూల మగు శబ్దరచనము వృత్తి. అది కైశికి ఆర్భటి సాత్వతి యని మూఁడు విధములుగ నుండును. సుకుమారార్థము నిచ్చునది కైశికీవృత్తి. ఔద్ధత్యమున కనుకూల మగునది యార్భటి. ఇది వీరరసమున కనుకూలముగ నుండును. సాత్వతీవృత్తి మిశ్రమముగ నుండును.

ఆర్భటీ వృత్తికి నుదాహరణము:—

185. మ. అమితస్థావరజంగమం బైనయీబ్రహ్మాండంబుదానెంతయున్
మమతాగోచర మీత్రిలోకములు నస్మద్బాహువజ్రాను
పాల్యములే నింద్రుఁడ

రీతి:—వైదర్భి, గౌడి, పాంచాలి, యని రీతి మూఁడు విధములు. అందు గౌడి కఠినపదములు సమాసములు కలిగియుండును. అట్లు కాకున్న

వైదర్భియనఁబడును. మిశ్రమముగ నున్నచోఁ బాంచాలి యనఁబడును. గౌడీ రీతికి నుదాహరణము.

129. శా. రాజత్కీర్తులు వచ్చి కాంచి రనఘుల్ రాముండు గృష్ణుండు న
య్యాజామీఢు నజాతశత్రు నృపలోకారాధ్యు నుదగ్రగుణ
భ్రాజిష్ణుం దమ మేనయత్తకొడుకున్ బాలార్కతుల్యోజ్జ్వల
త్తేజున్ భ్రాతృచతుష్కమధ్యగతు కౌంతేయాగ్రజున్ ధర్మజున్.

శయ్య యన వాక్యమునందలి పదముల యన్యోన్యమైత్రి. ఇది యర్థసౌలభ్యమునకు నవసరము. నన్నయకవిత్వమున నిట్టి భాగము మిగుల రమణీయమై యున్నది.

పాకమనగా:—అర్థగాంభీర్యము. అర్థము సులభముగ నగుచు మాధుర్యము స్ఫుటముగ నున్నచో నది ద్రాక్షాపాక మనఁబడును. ఇటులనే క్షీరపాక మనియును మధుపాకమనియును అనేకభేదము లూహ్యంబులు. వీనికి నుదాహరణములు గ్రంథమున స్వయముగ గ్రహింపనగును.

వర్ణనములు:—నన్నయ్య వర్ణనాచాతుర్య మసమాన మనఁదగును. కథాంశములును కథాపురుషుల రూపరేఖాదులును మనకండ్లకుఁ గట్టినట్లు ఇందలి వర్ణనములు మిగుల నాహ్లాదజనకములై యున్నవను సంగతికి గ్రంథమంతయు నిదర్శన మగుచున్నది.

కథారచనము:—కథారచనమునను నన్నయ్య కవిత్వము మిగుల శ్లాఘనీయమై యున్నది. పూర్వాపరసందర్భములును కథాపాటవంబును నెంతేని సొబగుగ నుండి గ్రంథప్రాశస్త్యమునకు హేతువు లగుచున్నవి.

# నాయకలక్షణము

కథాపురుషులలో ముఖ్యుఁడు నాయకుఁ డనఁబడును. అట్టి నాయకుని పురస్కరించుకొనిన లక్షణము నాయకలక్షణ మనఁబడును.

## నాయకనిర్ణయము.

ద్రౌపదీ స్వయంవరకథలో ననేకులు కథాపురుషు లుండ వారిలో నర్జునుఁడు నాయకుఁడని స్ఫుటముగఁ గనఁబడుచునే యున్నది. ద్రౌపదీ స్వయంవర భాగమున మొదటినుండి కొనవరకును నర్జునుఁడే నాయకుం డనవలసిన హేతువు లనేకములు కలవు. ద్రుపదుఁడు అర్జునునకు దేవి కాఁదగిన కూతును బడయఁగోరియే క్రతువొనరింప నట్టి క్రతువున నగ్నిదేవతా ప్రసాదమున ద్రౌపది పుట్టెను. అర్జునుని రప్పించు నుద్దేశము కలిగియే ద్రుపదుఁడు స్వయంవరము చాటించెను. అట్టి స్వయంవరమున నెవ్వరికిని సాధ్యముకాని మత్స్యయంత్రభేదన మొనరించి యర్జునుఁడు ద్రౌపదిని సంపాదించెను. మత్స్యయంత్ర భేదనానంతరమున ద్రౌపది యర్జునుని కంఠమున పూలదండ వేసెను. కనుక నర్జునుఁడే ద్రౌపదీ స్వయంవరకథకు నాయకుఁ డని నిశ్చయింపఁ దగియున్నది.

కాని కథాపురుషులలో నాయకుఁడు ముఖ్యుఁడై యుండవలె నను నంశము కొంచె మాలోచించినచో పాండవు లేవురిలో ధర్మరాజు ప్రాముఖ్య మంతటను గనఁబడుచున్నది. పంచపాండవులును అన్ని విషయములలో సమానులయ్యును భీమార్జున నకుల సహదేవులు ధర్మరాజునెడల భక్తి విశ్వాసములు కలిగి యాతనికి ననుచరులై యుండువారు. అర్జునుఁడును అతని యాజ్ఞానువర్తియై యుండి అన్నిపనులయందును అతని యభిప్రాయము ననుసరించి నడచువాఁడు. అంగారపర్ణుని విడిపించుటలో

ధర్మరాజు నాజ్ఞను జరిపెను. మత్స్యయంత్ర భేదనమునకు లేచునపుడు అన్న గారి యనుమతిని పొంది యాకార్యమునకుఁ బూనెను. ద్రౌపదీపాణిగ్రహణ విషయమున ధర్మరాజు చేసిన నిర్ణయమున కాతఁడొడఁబడెను. భీముఁడును ధర్మరాజునాజ్ఞ ననుసరించి ద్రుపదపురోహితునిఁ బూజించెను. ఇట్లు ధర్మానుజు లందఱు నాతని ప్రాధాన్యము నంగీకరించుటయేకాక పెరవార లందఱును ధర్మరాజునందే ప్రాముఖ్యము నుంచిరి. వ్యాసులు వచ్చినపు డెల్లను ధర్మరాజునే కొనియాడుచు నాతనితోడనే మాట్లాడుచుండెను. ద్రుపదుఁడును ద్రౌపదీవివాహనిర్ణయవిషయమున ధర్మరాజు నభిప్రాయ మందే ప్రాముఖ్యము నుంచి తీర్మానించెను. అట్టి తీర్మాన మప్పుడు ద్రుపదుఁడు,

157. 'ఇది యింక నీవును నేనును గుంతీదేవియును ధృష్టద్యుమ్నుండును రెల్లి నిశ్చయింతము'

అనుటవలనను అర్జునుని తమయాలోచనమునఁ జేర్చకుండుటచేతను ధర్మరాజుప్రాముఖ్యము నంగీకరించినట్లు స్పష్ట మగుచున్నది. ద్రౌపదీపాణిగ్రహణమును ముందుగ ధర్మరాజుచేసెను. ఇట్టి కారణములచేత కథయందల్లెడలను పాండవులలో ధర్మరాజుయొక్క ప్రాముఖ్యము వెల్లడి యగుచుండగను అర్జునుఁ డాతనికి ననుచరమాత్రుండై సంచరించుటవలనను ధర్మరాజు నాయకుఁ డనుటకూడ సహేతుకముగ నున్నది.

ఇట్లుండ మనకథకు ధర్మార్జును లిద్దరును నాయకులనఁ గూడదా యనిన లాక్షణికులు

'తత్రైకో నాయక స్స్మరః'

అని నిరూపించుటచేత కావ్యమునకు నాయకుఁడొక్కఁడే యుండవలె నని కనఁబడుచున్నది. దీనికింగూడ నొక్కవిశేషమున్నది. శాస్త్రమునకు విరుద్ధముగ ద్రౌపదికి నేగురు భర్తలుండగా మనకథకు నిద్దరు నాయ

కులుండుటలో నేమి లోపమున్నది యనునదికూడ యొక హేతువగును. కావున ధర్మార్జును లిద్దరును నాయకు లనినను సహేతుకముగ నున్నది.

మొత్తమున నీవాదముయొక్క ఫలిత మెట్లున్నను ధర్మార్జునులలో నెవరిని నాయకుఁడనినను లేక యిద్దరిని నాయకులుగఁ జేసినను నాయక గుణములును లక్షణములును ఉభయులయెడలను సమానముగనే వర్తించుచున్నవి. కావున కావ్యవిమర్శనమున కీవిషయమున నెట్లు నిర్ణయించినను సరిపడియే యుండును.

అయినను ధర్మరాజుం బురస్కరించుకొని నాయకలక్షణమును విమర్శింప నైనగు.

## నాయకగుణము.

కావ్యములందు కథానాయకున కుండవలసిన గుణములను లాక్షణికులు నిర్ణయించి యున్నారు. కావ్యనాయకుఁడు సురుఁడుకాని సద్వంశసంభూతుఁడగు క్షత్రియుఁడుకాని కావలెను. అతఁడు ధీరోదాత్త గుణములు కలవాఁడు కావలెను. కథాంతమున నతనికి నభ్యుదయము కావలెను. ఇట్టి లక్షణములన్నియు ద్రౌపదీ స్వయంవరకథయందు పాండవులందఱి యెడలను పట్టియున్నవి.

పాండవు లందఱును దేవతాప్రసాదమునఁ బుట్టినవారు. వారు పూర్వమునఁ బంచేంద్రు లనునది గ్రంథస్థము కనుక వారు దేవతా సమానులని తెలియుచున్నది. వారుబుట్టినవంశము చంద్రవంశము. వారి పూర్వు లందఱును పుణ్యపురుషులును ప్రఖ్యాతి నొందినవారలు నగుటంజేసి వారు సద్వంశసంభవులనియును ఉత్తమ క్షత్రియు లనియునుస్పష్టపడుచున్నది. వారి వ్యాపారములవలనకూడను వా రుత్తమక్షత్రియు లనుమాట తేటపడుచున్నది. కావున ధర్మరాజు కావ్యార్హుం డగునాయకుం డయ్యెను. ఈవిషయము లన్నియును గ్రంథస్థాంశములవలననే సమర్థింప నగును.

ఇంక నాయకగుణము లనేకములు లాక్షణికులు నిర్ణయించి యున్నారు.

'మహాకులీనతౌజ్జ్వల్యం మహాభాగ్య ముదారతా
తేజస్వితా విదగ్ధత్వం ధార్మికత్వాదయో గుణాః' ॥

అనఁగా గొప్పకులమునందు బుట్టుటయు సురూపవంతుఁడై మహాపురుషలక్షణములు కలిగి యుండుటయు విశ్వంభరాధిపత్యమును కలిగి యుండుటయు దానశీలతయుఁ బ్రఖ్యాతిఁ బడయుటయు కార్యనిర్వహణచాతుర్యమును ధర్మమునందు బుద్ధికలిగియుండుటయు మొదలగునవి కావ్యనాయకగుణములు. ఈగుణము లన్నియును కథాసందర్భమున ధర్మరాజునందు నగుపడుచునే యున్నవి. సత్కులప్రసూతత్వము మీదనే వివరింపఁబడినది. పాండవుల రూపరేఖావిలాసాదు లన్నియు,

148. అజినోత్తరీయుల నతిసంభృత బ్రహ్మ
తేజుల సముదితాదిత్యసముల
నాజానులంబి మహాబాహు పరిఘుల
నత్యున్నతాంసుల నతి విశాల
వక్షుల నవిరళ వ్యాయామదృఢ కఠి
నాంగుల వృషభాక్షు లయినవారి

అని వర్ణింపఁబడి యున్నవి. విశ్వంభరాధిపత్యము పాండవులయందు నప్పటికి లేకున్నను ముందువారికి కలుగఁ బోవుచున్నదనునది సుప్రసిద్ధము గనుక నీలక్షణమును వారియందు కలదని నిశ్చయింపవచ్చును. ఇంతియకాక [illegible]నసి,

'అశేషోర్వీనాథులార'

అని వారిని సంబోధించెను. ఈ సంబోధనము కేవలము కార్యగౌరవముచేతను తన భర్తకు ప్రాణభయము కలుగునన్న యాతురతచేతను పలికిన మాటలగుటచేత దానిని సార్థకముగ నెంచఁగూడదని తోఁచును; కాని

యమిత వీర్యవంతుఁడగు నంగారపర్ణుని జయించి యీడ్చికొని పోయినవార లెంతటివారలో యనుతలంపున వారలు లోకారాధ్యులగు మహాపురుషులని తలఁచి యట్లు సంబుద్ధి చేసెనని యెంచవలసియున్నది. ఇంతియకాక యంగారపర్ణుఁడు

57. మేరునగోత్తంసమహీభారధురంధరులు

అని పాండవులను స్తుతించెను. కాన వారియందు నట్టి మహాపురుష లక్షణములు కలిగియున్ననుటకు సంశయములేదు. ధర్మరాజుయొక్క దానశీలత యంగారపర్ణునకుఁ బ్రాణదానము చేయుటచేతనే కనఁబడుచున్నది. ఇంకను తాము భిక్షమెత్తి తెచ్చినయన్నములో

135. 'బ్రాహ్మణాతిథులకు నన్న కాంతులైన
యతిథులకును నగ్రమందునుంచి'

యనుటవలన వారిదాన పరతంత్రత తేటఁబడుచున్నది. పాండవుల ఖ్యాతి యంగార పర్ణుఁడు

56. 'క. విమలములయి లోకత్రిత
యములఁ బ్రవర్తిల్లు మీ మహాగుణములు ని
త్యాము విందు నారద ప్రము
ఖమునీశ్వర సిద్ధ సాధ్యగణములవలనన్'

అని స్తుతించుటవలన స్పష్టమగుచున్నది. కార్యనిర్వాహణ చాతుర్యమునకు ధర్మరాజు సంకల్పము నెరవేరుటయు నాతని సంకల్ప మమోఘముగ జరుగుటయు నిదర్శనము లయినవి. ధార్మికత్వ విషయమున నాతని దీక్ష కథయందెల్లెడలను కనుచున్నారము. ధర్మపరతంత్రతచేతనే యాతనికి ధర్మరాజను పేరు సార్థకమయ్యెను. అతని ధర్మశీలమును వ్యాసులును ద్రుపదుఁడును,

35. 'ధర్మసుతుఁడున్న చోటను
ధర్మమునకు హానికలదె ధారుణిన్'

157. 'నీవు లౌకిక వైదిక ధర్మస్వరూప వేదివి. ధర్మాత్మజుండవు నీపలుకులు ధర్మవిరుద్ధంబు లని పలుక నోడుదుము.'

160. 'తన పలుకులోకమెల్లను
గొని యాడగ దగిన లోకగురుండీయమనందనుండు'

అని చేసినస్తుతివలన ప్రసిద్ధమగుచున్నది.

కథానాయకులు నాలుగు విధములుగ నుందురని లాక్షణికుల యభిప్రాయము. వారు ధీరోదాత్తుడు ధీరోద్ధతుడు ధీరశాంతుడు ధీరలలితుడును వారలు. వారిలో ధీరోదాత్తుడు మహాసత్త్వసంపన్నుడై అతిగంభీరుడై కృపాశీలుడై ఆత్మస్తుతిలేనివాడై ధైర్యవంతుడై యుండవలెను. ధీరోద్ధతుడు దర్పమాత్సర్యములు కలిగి ఆత్మస్తుతి జేసికొనుచు మాయావియై క్రోధస్వభావము కలిగి తీవ్రమగువ్యాపారము కలిగియుండును. ధీరశాంతుడు వివేచనము కలవాడై క్లేశమును సహించుచు; ఇంద్రియనిగ్రహము కలిగి సంతుష్టి కలిగి ప్రసన్నమగు మనస్సు కలవాడుగ నుండును. తరచు ధీరశాంతుడు బ్రాహ్మణుడయి యుండును. ధీరలలితుడు నిశ్చింతుడై శృంగారచేష్టలం దగిలి వినోదశీలుడై యుండును. ఈనాలుగు విధముల నాయకులలో ధీరోదాత్తుడుత్తమనాయకుడు కావ్యనాయకుడు ధీరోదాత్తుడుగా నుండవలెననునది మీద కనబరుపబడినది. ధర్మరాజు ధీరోదాత్తలక్షణసంపన్నుడనుటకు గ్రంథమున ననేక నిదర్శనము లున్నవి. పాండవులందఱును మహాసత్త్వసంపన్నులనునది సుప్రసిద్ధము; ధర్మరాజు గాంభీర్యము అతడు ద్రుపద పురోహితునితో నాడినమాటలవలన స్పష్టమగుచున్నది. అతని కృపాశీలము అంగారపర్ణునకు ప్రాణదానము చేయుటవలన దెలియుచున్నది. అతడాత్మస్తుతి చేసికొనలేదన్నమాటయు తెలిసిన విషయమే. ఈవిషయమున 164 వ. పద్యమునందలి విశేషమును చూచునది. ధర్మరాజు ధైర్యవంతుడను నదియు సుప్రసిద్ధము. కావున ధర్మరాజు ధీరోదాత్తనాయకుడని నిశ్చయింపనైనది. కథాంతమున నతనికి గళ్యాణప్రాప్తియైనదిగాన నాయకాభ్యుదయము కూడ నీకావ్యాంశమై యున్నది.

# గ్రాంథిక లక్షణము.

---

కవిరచితములు కావ్యములు. అవి మహాకావ్యము లనియు ఉపకావ్యము లనియు క్షుద్రకావ్యము లనియు ననేకవిధములుగ నుండును. వానిలో మహాకావ్యముయొక్క ప్రయోజనములును దానిలో నుండ దగిన యంశములును లాక్షణికులచే వక్కాణింపఁబడి యున్నవి. ఆ విశేషము లన్నియు గ్రాంథికలక్షణ మనదగును.

## మహాకావ్య ప్రయోజనములు.

'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే''

అనుటవలన స్పష్టమగుచున్నవి. కావ్యము యశస్కరమై పురుషార్థప్రాప్తిసాధనమై లోకవ్యవహారబోధకమై అమంగళము తొలగించునదియై పరమమగు సౌఖ్యమునిచ్చునదియై ధర్మోపదేశము చేయునదియై యుండవలెను. అట్టిపటుత్వముగల గ్రంథములు మహాకావ్యములనియు నందురు. ఈప్రయోజనములు సిద్ధించుటకు నవసరములగు కొన్నియంశములు లాక్షణికులు పేర్కొనియున్నారు. ఉత్తమకావ్యములందు ఉత్తమపురుషచరితంబులును, ఉత్తమగుణ వర్ణనంబులును ఖలుల నిందయు సత్పురుషుల స్తుతియు నుండవలెను. ఈ విశేషంబులుగల గ్రంథములఁ జదివిన నుత్తమగుణముల యందు నాదరమును క్షుద్రగుణములయందు ననాదరమును కలుగును. ఇంతియకాక నట్టి గ్రంథపఠనము సంతతమును చేయుటవలన ధర్మాసక్తియు నధర్మనిరసనమును మనస్సున కుదురుపడుటయేకాక యట్టి సత్పురుషులవలె సంచరింపవలెనను నాసక్తియు క్షుద్రులవలె నుండకూడదను నిశ్చయమును కలుగును.

కావున నట్టిగ్రంథములు న్యాయబోధకములై యిహపర సాధకములై యుత్తమగ్రంథములను ఖ్యాతిని బడయును.

ధర్మోపదేశము చేయు గ్రంథములు శ్రుతిస్మృతిపురాణేతిహాసము లని నాలుగు జాతులుగా నున్నవి. వానిలో వేదములును స్మృతులును రాజు తన ప్రజలను శాసించి వారికి క్షేమము నిచ్చునట్లు విధించును. కావున నవి ప్రభుసమ్మితము లనఁబడును. పురాణములు స్నేహితులవలె యుక్తియుక్తముగఁ గథలఁ జెప్పి దృష్టాంతసహితముగ హితవును బోధించును కావున నవి సుహృత్సమ్మితము లనఁబడుచున్నవి. పురాణములు లోకవ్యవహారసాదృశ్యసూచకంబు లగు కథలఁ జెప్పి మనస్సున కింపును పుట్టించుచు ధర్మబోధనమును చేయునవి గాన నవియు ధర్మబోధకంబు లగుచున్నవి. ప్రేమాస్పదురా లగు కాంత చెప్పిన మృదూక్తులు పురుషున కెట్లు హితముగ నుండునో అటులనే మనస్సునకు నాహ్లాదమును పుట్టించుకథలలో నిమిడి యున్న ధర్మములు చదువరులకు నత్యంతహితంబులగును గావున నవి కాంతాసమ్మితములను పేరు పొందెను. కావ్యములును అట్టి ప్రయోజనమునే సిద్ధింపఁ జేయునుగాన నవి యును కాంతాసమ్మితము లనఁబడుచున్నవి. ఉత్తమపురుష చరితంబులును ఉత్తమగుణవర్ణనంబులును లేని గ్రంథములు విడువఁదగినవి యని లాక్షణికుల యభిప్రాయము. కావుననే రామాయణాది మహాగ్రంథములు సర్వజనుల చేతను ఆదరింపఁబడుచుఁ బఠింపఁబడుచున్నవి. వానికిఁ గల పూజ్యత తక్కిన వానికి లేకుండుటకు నిదియె కారణము. అట్టిగ్రంథములే నిత్యపారాయణమునకును పురాణశ్రవణమునకును మనదేశీయు లందఱిచేతను ఉపయోగింపఁబడుచున్నవి.

మహాకావ్యమున నుండవలసిన లక్షణములును వర్ణనములును మనదేశపు లాక్షణికులు నిర్ణయించియేయున్నారు. అవి యెవ్వి యనినః—

"నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయ వర్ణనం
ఉద్యాన సలిలక్రీడా మధుపానరతోత్సవాః

విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనమ్
మంత్ర ద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయా అపి!

అనఁగా పురము సముద్రము కొండ ఋతువులు సూర్యచంద్రోదయములు విప్రలంభము వివాహము పుత్రజననము మంత్రము ద్యూతము ప్రయాణము యుద్ధము నాయకాభ్యుదయము ననువాని వర్ణనము లుండవలెను. ఇంకను మఱికొన్నింటిని లాక్షణికులు చేర్చెదరు. ఇవి యన్నియు నుండక తప్పదని వారి మతము కాదు. వానిలో కొన్నింటి వర్ణనములు లేకున్నను కావ్యమునకు లోపము కాదని లాక్షణికుల యభిప్రాయము-

ఈవిశేషములలో ముఖ్యాముఖ్యవివక్ష చేయవలసిన యవసరమున్నట్లు కనఁబడుచున్నది. వానిలో కొన్ని వర్ణనా విశేషములు. అవికేవలాహ్లాదజనకములు కాని మహాకావ్యప్రయోజనసిద్ధికి నవసరములుకావు. కొన్ని యట్టి ప్రయోజనమునకు ముఖ్యసాధనములు. వెనుక సూచింపఁబడిన నాయక లక్షణములు మొదలగునవి అనఁగా ఉత్తమపురుష చరితములు-ఉత్తమగుణవర్ణనములు ధర్మోపదేశములు ఖలనింద, సజ్జనస్తుతి నాయకుడు ధీరోదాత్తగుణ సంపన్నుఁడగుటఁ అట్టినాయకుని యభ్యుదయము మొదలగునవి యన్నియును మహాకావ్యమునకు ప్రధానాంగములుగ నెంచదగినవి. అవిలేనిచో కావ్యప్రయోజనములు సిద్ధింపనేరవు. తక్కినవి యన్నియు నప్రధానములనఁ దగును.

కావ్యకథ ఉత్తమపురుషచరిత్రము కాకున్నను అందు నుత్తమగుణవర్ణనము లేకున్నను చదువరులకు హితప్రాప్తియు నహితనివృత్తియు పురుషార్థప్రాప్తియు కలుగ నేరదనుమాట తెల్లమైన విషయము. ఇటులనే నాయకాభ్యుదయమును మిగుల నవసరము. ఏలననఁగా నుత్తమపురుషుఁడుతుదకు హానిఁ జెందెననిన ధర్మశీలము శ్రేయస్కారి కాదనియు దానివలననష్టమే కలుగుననియుఁ జదువరులకుఁ దోఁచును. కావున ధర్మమునందు ననాదరము కలుగును. ఇటులనే క్షుద్రనాయకునకు నభ్యుదయప్రాప్తి చెప్పఁబడిన

నధర్మమును శూద్రవ్యాపారమును శ్రేయస్కరము లని తోఁచును. ఇట్టి హేతువులనుబట్టియే మహాకావ్యములందు నుత్తమపురుషచరిత్రములును ఉత్తమగుణవర్ణనములును నుండవలె ననియు నాయకాభ్యుదయముకూడ కథాంగముకావలయుననియు లాక్షణికు లేర్పరచిరి.

మన ద్రౌపదీస్వయంవరకథయందలి మహాపురుషు లందఱును మిగుల నుత్తమపురుషులు. వారలెల్లరును ధర్మపరులు సత్యసంధులు సదాచారసంపన్నులు. ధర్మరాజునందు నన్నిలక్షణములు నున్నవని వెనుకటి విమర్శనమున స్పష్టమైనది. అతని కళ్యాణప్రాప్తియే కథాంతముగాన నాయకాభ్యుదయముకూడ ప్రాప్తించినది. ఇందు దుర్యోధనాదుల నింవయు నున్నది.

తక్కిన వర్ణనములలోఁ గొన్నికూడనీ గ్రంథమున నున్నవి. యుద్ధములు అర్జునాంగారపర్ణులకును భీమశల్యులకును కర్ణార్జునులకును జరిగినవి. ధృష్టద్యుమ్నుని జన్మప్రకారము వర్ణింపఁబడినది గాన కుమారోదయ వర్ణనమున్నది. నగర మంత్ర వివాహ జలక్రీడప్రయాణప్రశంసలు కూడ నీ కథయందు దున్నవి.

అన్ని విషయములును విచారింపఁగా నీద్రౌపదీస్వయంవరము ధర్మోపదేశ పాటవంబు గలిగిన మహాకావ్యమనియనఁ దగి యున్నది.

---

# ఉపసంహారము.



భారతము పంచమవేద మని సుప్రసిద్ధమై యున్నది. ఆగ్రంథము మన భరతఖండమున సర్వజనపూజ్యంబై ధర్మాధర్మప్రమాణంబై భక్తిపూర్వకంబుగఁ జదువువారలకు లోకద్వయసాధనభూతంబై యొప్పారుచున్నది. భారతముయొక్క మహిమమును వర్ణించుటకు వేయినోళ్లు గలశేషునకునైనను అలవిగాదు. భారతమహిమ మెట్టిదనిన:—

సీ. ధర్మతత్త్వజ్ఞులు • ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వే • దాంత మనియు
నీతివిచక్షణుల్ • నీతిశాస్త్రం బని
కవివృషభులు మహా • కావ్యమనియు
లాక్షణికులు సర్వ • లక్షణం బనియును
నైతిహాసకు లితి • హాస మనియుఁ
బరమపౌరాణికుల్ • బహుపురాణసముచ్చ
యం బని మహిఁగొని • యాడుచుండ

తే. వివిధ వేదతత్త్వ • వేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశ • రాత్మజుండు
విష్ణుసన్నిభుండు • విశ్వజనీన మై
పరగుచుండఁజేసె • భారతంబు. (ఆది. 1 ఆ. 31)

అట్టి భారతంబున మహావిషయము లంతటనుకన్పట్టుచునే యున్నవి. అట్టి ఘట్టములలో నగ్రగణ్యములై చెలువారువానిలో ద్రౌపదీస్వయంవర మొకటి. దీనియందు నార్యమతసాంప్రదాయములు నమ్మకములు ధర్మములు సదాచారములు మొదలగు న్యాయరత్నము లన్నియుఁ జక్కగ బోధింపఁబడి చదువరులకు వానియందు పూర్ణవిశ్వాసము కలుగుటకుం దగునట్టులు వర్ణింప

బడినవి. జీవునకు జన్మాంతరములు కలుగుచుండుటయుఁ బూర్వజన్మముల వాసనలు పరజన్మములందు ప్రబలములై యుండుటయుఁ వివాహధర్మములు మాతృభక్తి సత్యదీక్ష ధర్మపరతంత్రత అధర్మభీతి అసత్యభీతి గురుభక్తి లౌక్యతంత్రచాతుర్యము కుటుంబజనులయన్యోన్యము, జ్ఞానవైరాగ్యములు మొదలగు ననంతధర్మరత్నములకాకరంబై యాదిపర్వంబునకు మకుటమనఁదగినదియై యీద్రౌపదీస్వయంవరము పఠనీయగ్రంథమై యున్నది.

సీ. ఆయురర్థులకు దీ♦ర్ఘాయు గవాప్తియు
నర్థార్థులకు విపు♦లార్థములును
ధర్మార్థులకు నిత్య♦ధర్మసంప్రాప్తియు
వినయార్థులకు మహా♦వినయ మహిమయు-
బుత్రార్థులకు బహు♦పుత్రసమృద్ధియు
సంపదర్థుల కిష్ట♦సంపదలును
గావించు నెప్పుడు ♦ భావించి వినుచుండు
వారికి నిమ్మహా♦భారతంబు

గీ. భక్తియుక్తులైన ♦ భాగవతులకు శ్రీ
వల్లభుండు భక్త♦వత్సలుండు
భవభయంబులెల్లఁ ♦ బాపి యిష్టార్థసం
సిద్ధిఁ గరుణతోడఁ ♦ జేయుచుండు.

అని యున్నది గాన దీని నందఱును విమర్శపూర్వకముగ పఠించి యందలి జ్ఞానామృతపానముఁ జేసి యిహపరసౌఖ్యంబుల నందెదరుగాక యని దైవమును ప్రార్థించుచున్నాఁడను.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

Printed at the Ananda Press, Madras.